B



విద్యానగర శంకుస్థాపనము

జీర్ణవిజయనగర చరిత్రము—పుట ౨౧.

# పీఠిక

ఆంధ్రచరిత్రమునందు ముఖ్యములైన మూఁడుజీర్ణనగరముల చరిత్రములు దైవఘటనమునకును, కర్మపరిపాకమునకును నిదర్శనములుగ నున్నవి. దయామయా, నీఘటనాఘటనచాతుర్యము నెవరు గ్రహింపఁగలరు? పర్వతములు సముద్రములగుచున్నవి; సాగరములు మహానగము లగుచున్నవి; వనములు నగరము లగుచున్నవి; నగరములు వనము లగుచున్నవి; శిలలు దివ్యవిగ్రహము లగుచున్నవి; దివ్యవిగ్రహములు పూజాపురస్కారములు లేక పాడురాళ్ళగుచున్నవి. స్థలాభోగమునకును, శిలాభోగమునకును మహాసంకల్పము గర్మపరిపాకము మూలములుగదా! నిగ్రహము, వైరాగ్యము,దుఃఖానుభవము పరమార్థసాధనములని వెల్లడిచేయుటకు భారతమాతకు నిరంతర దుఃఖానుభవము నాజ్ఞాపించితివా! దేవా, నీ విలాసములు నిగూఢములై అజ్ఞాతములుగ నున్నవి.

ఆదియుగమునం దమరావతియందు విలసిల్లిన దివ్యస్తూపశిథిలములు విషాదమును గలుగఁజేయుచున్నవి.

ఆశిథిలశకలములు లండను, మద్రాసు మ్యూజియముల నలంకరించుచు గతవైభవమును సంస్మరింపఁజేయుచున్నవి. త్రిలింగరాజధానిమై విలసిల్లిన ఏకశిలానగరశిథిలములు పరమవిచారమును గలుగఁజేయుచున్నవి. త్రిలింగరాజ్యవైభవము ననుభవించిన ప్రాసాదావరణములు మహమ్మదీయకుటీరముల కాశ్రయములుగ నున్నవి. మహోదశ ననుభవించిన జీర్ణవిజయనగరము పరమసంతాపమును గలుగఁజేయుచున్నది. రాజమందిరములు, నగరులు, దేవాలయములు శూన్యాలయములై భయభ్రాంతులను గలుగఁజేయుచున్నవి. విద్యానగరమునందు జీర్ణాలయములందు నివసించుచున్న యధిష్ఠానదేవతలు ధర్మజ్ఞులకు విద్యానగరవిజయనగరతత్త్వములనుపదేశించుచును, నిర్జనమైన జీర్ణనగర మస్థిరములైన సామ్రాజ్యతత్త్వములను వెల్లడిచేయుచునున్నది. విరూపాక్షస్వాములు,సాహిత్యవిశారదులు, ధర్మశాస్త్రజ్ఞులు సుస్థిరమైన ధర్మమును బోధించుచున్నారు. సామ్రాజ్యసౌభాగ్యమును,ధర్మాభ్యుదయమును ననుభవించిన యాంధ్రావనియందు రాజవంశములు క్షీణించినవి; స్వాతంత్ర్యరాజ్యములు నిర్గమనమును బొందినవి. సాతవాహనులు, పల్లవులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగరాధీశులు కీర్తిమాత్రావశిష్టులైరి. హతశేషములైన సంస్థానములు

రాజ్యభాగ్యప్రతిభావిరహితములై స్వధర్మారాధనమున కు నిరుపయోగములుగ నున్నవి.

బ్రిటీషుయుగమునందు సంప్రాప్తమైన దైన్య స్థితికి బీజము లాదియుగమునుండియును గుప్తముగ నున్నవి. ఆంధ్రతత్త్వము కేంద్రాధికారమునకు సుము ఖము గాకున్నది. దేశాకారమును, ప్రజాతత్త్వమును కేంద్రాధికారమునకును సంయోగమునకును సుముఖ ములు గాకున్నవి: ఆంధ్రదేశము కొంతభాగము తీరప్ర దేశమునందును, కొంతభాగము మధ్యభాగమునందును వ్యాప్తమై, గోదావరీ, కృష్ణా, పినాకినీ, తుంగభద్రాదినదు లచే ఖండితమైయుండుటచే భిన్నత్వమున కనుకూల పరిస్థి తులేర్పడినవి. చిన్నిరాజ్యము లేర్పడి స్వీయసంరక్షణమును జేసికొనుటకును, పరులను బ్రతిఘటించుటకును నిరుప యోగము లైనవి. సాతవాహనులు, ప్రతాపరుద్రులు, దేవరాయంద్రు స్థాపించిన మహారాజ్యము లచిరకాలము ననె యంతరించినవి.

విజయనగరసామ్రాజ్యవినాశముతో నాంధ్రరాజ్య ప్రాభవ మస్తమించినది. ఆంధ్రుల శౌర్య ప్రతాపములు క్షీణించినవి. సాహిత్యకళాభిజ్ఞానము ముకుళించినది. మహమ్మదీయ బ్రిటీషుప్రభుత్వములు విజృంభించినవి.

ఆంధ్రరాజ్యము లన్యోన్యకలహములు కాలవాలములై నశించినవి. రాజ్యములుపోయి జమీందారీ లేర్పడినవి. సంయోగాభ్యుదయములకుఁ బ్రతిబంధకము లైన స్వస్థలాభిమానము, స్వాభిమానము, విశ్వాసాభావము, భేదోపాయము సహజములై యభ్యుదయము దుస్తర మైనది. వర్తమానపరిస్థితులును జిరకాలానుగతంబైనదుర్బలప్రవృత్తిని విశదముచేయుచున్నవి. మహత్తరమైన జీర్ణవిజయనగరసందర్శనము, సంస్మరణము, భారతీయులకును, నాంధ్రులకును జ్ఞానోపదేశమును జేయుటకు సాధనంబులుగ నున్నవి.

మహమ్మదీయాక్రమణము

ఆనందవిషాదపూరితము లైన విజయనగరాభ్యుదయమును, విలయమును దక్షిణదిగ్భాగమున మహమ్మదీయవిజృంభణమునందు మహాఘట్టములుగనున్నవి. కాకతీయులు పరిపాలించిన త్రిలింగరాజ్యము 1321 సంవత్సరప్రాంతమునందు మహమ్మదీయుల హస్తగత మైనది. తదనంతరము హొయిసల యాదవ రాజ్యములును ధ్వంసము లైనవి. హతశేషులైన హొయిసల యాదవ కాకతీయ రాజ్యాశ్రితులు నూతన నివాసములను గైకొని రాజ్యములను స్థాపించిరి. ఆంధ్రరాజ్యలక్ష్మి ఓరుగల్లునుండి

తుంగభద్రాతీరప్రాంతములకుఁ జేరినది. హరియప్ప బుక్కప్పలు విజయనగరమును సామ్రాజ్యమును స్థాపించిరి. వీరు కాకతీయరాజ్యాశ్రితు లని కొందఱును, హొయిసళరాజ్యాశ్రితు లని కొందఱును నభిప్రాయపడుచున్నారు. పరిశోధన లాంధ్రదేశాగతులుగ సూచించుచున్నవి. విజయనగరనిర్మాణము విద్యారణ్యస్వాముల సంకల్పిత మను గాథలు దైవసంపద్విలాసమునకు నిదర్శనముగ నున్నను వివేకోదయము గలుగకున్నది.

రామాయణకాలమునందుఁ గిష్కింధనామమునఁ బవిత్రమైన ప్రదేశము . మహమ్మదీయయుగము నందు విజయనగరనామమున విఖ్యాతమై వర్తమానకాలమున శిథిలహంపీరూపమున విషాదమును గలుగఁజేయుచు దైవఘటనకు నిదర్శనముగ నున్నది. మహావైభవము ననుభవించిన విజయనగరమును భగ్నముచేసిన దురంత దుర్మార్గము హిందూదేశము నావరించిన దురదృష్టమును వెల్లడిచేయుచున్నది. భరతవర్షచరిత్రమునం దెన్ని పర్యాయములో దేవాలయములు మసీదు లైనవి; నగరములు పాడుపడినవి; లక్షలమంది హింసలకు వధలకుఁ బాల్పడిరి. కాని నేటికిని భరతమాతకు శాంతి సమకూరకున్నది. భరతవర్ష చరిత్రమునందు దక్షిణభాగమున వెలసిన

విజయనగరోపాఖ్యాన మిట్టిఘట్టములం దత్యద్భుతమైన ఘట్టముగ నున్నది. విజయనగరరాజ్యము 240 ఏండ్లు మహమ్మదీయ విజృంభణమున కడ్డుపడి హిందూధర్మాభ్యుదయమునకును, రక్షణమునకును వినియోగపడినది.

దక్షిణపీఠభూమి

పదునాల్గవ శతాబ్దారంభమునందు దక్షిణ పీఠభూములందు మహమ్మదీయదండయాత్రలు విజృంభించినవి. కృష్ణాగోదావరులమధ్య బహమని రాజ్యమును హసన్ గంగు 1347 ప్రాంతమునందు స్థాపించెను. కృష్ణకు దక్షిణమున మైసూరు పీఠభూమియందు హరిహరరాయల క్రింద విజయనగరరాజ్యము వర్ధిల్లినది. దక్షిణదిగ్భాగము చిన్న చిన్న రాజ్యములతో నిండి, పరస్పరకలహములు కాలవాలమై, పరరాజవిజృంభణమున కనుకూలముగ నుండెను. ఈ చిన్ని రాజ్యములు దక్షిణమున విజయనగరరాజ్యమునకును నుత్తరమున బహమనిరాజ్యమునకును బలి యగుచుండెను. బహమనిరాజ్యము 1500 ప్రాంతములందు మహమ్మదుషాహ కాలమున 1. బీజాపూరు, 2. గోలకొండ, 3. అహమదునగరు, 4. బీదరు, 5. బీరారుగను చీలిపోయినది. దక్షిణదేశచరిత్రము 200 సంవత్సరములు బహమని విజయనగరరాజ్య

ముల కలహాములతోను హిందూమహమ్మదీయరాజ్యము లయంతఃకలహాములతోను నిండి విషాదపూరితముగ నున్నను నీకాలమునందు మహాప్రతిభను బడసిన విజయ నగరచరిత్రము పరంజ్యోతివలె వెలయుచున్నది.

విజయనగరసామ్రాజ్యము

ఆంధ్రభాషకు బ్రౌను గారు చేసిన యుపకృతిని ఆంధ్రచరిత్రమునకు రాబర్టు స్వ్యాయలుగా రొనరించిరి. స్వ్యాయలుగారు "విస్మృతసామ్రాజ్యము"ను రచియించి కర్ణాటాంధ్రహృదయములందు గతవైభవసంస్మరణమును జేయఁగలిగిరి. తదనంతర మాత్మసంస్మరణము గలిగి ఆంధ్రాంగ్ల కర్ణాటకభాషలందు విజయనగరసామ్రాజ్యమునకు సంబంధించిన గ్రంథములు వెలువడుచున్నవి. జీర్ణకర్ణాటకము, శ్రీకృష్ణదేవరాయలు, హంపీశిథిలములు మొదలగు గ్రంథములు విజయనగరరాజ్యవైభవమును ప్రత్యక్షము చేయుచున్నవి. శ్రీయుత కుందూరి ఈశ్వరదత్తు గారు రచియించిన "జీర్ణవిజయనగరచరిత్రము"ను విజయనగరప్రతిభను విశదము చేయుచున్నది. విజయనగరము మహమ్మదీయవిజృంభణమును 240 ఏం క్లరికట్టినను శాంతిస్థాపనమునకు సాధనము గాలేదు. బహమని విజయ నగరముల సంరంభము విషాదపూరితసంరంభముగ నున్న

ది. హిందూ మహమ్మదీయ ప్రభువుల క్రోధాగ్నికు లక్షల ప్రజ లాహుతులై మహాదుఃఖము ననుభవించిరి.

విజయనగరచరిత్రము హిందూయుగ చరిత్రము నందుఁ జరమయుగచరిత్రకు నిదర్శనముగనున్నది. విజయనగరమునందు వైదికక్షాత్రధర్మము లన్యోన్య వైషమ్యము లేక వర్ధిల్లినవి. విద్యారణ్యస్వాములు, హరిహరరాయలు విజయనగరసామ్రాజ్యాభ్యుదయమునకుఁ బాటుపడిరి. బ్రాహ్మణ బ్రాహ్మణేతరనాయకులు రణరంగములందును, సాహిత్యకళారంగములందును, కృషివాణిజ్యరంగములందును, కలిసి పనిచేసి విజయనగరసామ్రాజ్యాభ్యుదయమునకు సాధకులైరి. రణరంగములందు గోసనమంత్రి, మారనమంత్రి, సాళువతిమ్మరుసు మొదలగుదండనాయకులు విజయనగరాధీశుల విజయములందుఁ బ్రఖ్యాతిని బడసిరి. సాహిత్యరంగమునందు శ్రీకృష్ణదేవరాయలు, పెద్దనాదులు ప్రసిద్ధిని గడించిరి. రాజాశ్రయముగల శిల్పకృషివాణిజ్యము లభ్యుదయమును బొందినవి. విజయనగర ప్రభుత్వము నిరంకుశప్రభుత్వ మైనను స్వదేశప్రభుత్వము ప్రజాసత్త్వమునువికసింపఁజేయఁగల విధమును విశదము చేయుచున్నది.

విజయనగరసామ్రాజ్యము సర్వతోముఖమైన ఆంధ్రసత్వాభ్యుదయమునకు సాధనం బైనది. విజయనగరయుగమునందు విలసిల్లిన వీరవిలాసములు, సాహిత్యరచనలు, శృంగారకలాపములు, శిల్పనిర్మాణములు, కృషివాణిజ్యవిన్యాసములు, ధర్మజిజ్ఞాసలు, మతాభిమానములు, స్వాతంత్ర్యప్రయోజనమునకు నిదర్శనములుగ నున్నవి. ఆంధ్రచరిత్రమునందు విజయనగరయుగము ఉచ్ఛ్రయయుగముగ నున్నది. సాయణాచార్యుల వేదభాష్యము, శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయములు, ఆంధ్రభోజుని సాహిత్యాభిమానము, అష్టదిగ్గజముల కావ్యరచనలు, విజయనగర సంపదలు, ప్రాసాదమందిరాలయాదుల శిల్పవైభవములు గతవైభవమునకు స్మరణచిహ్నములుగ నున్నవి. ఆంధ్రుల కాత్మసంస్కరణమును విజయనగరచరిత్ర మత్యుద్భుతముగఁ జేయుచున్నది. దక్షిణభాగమునందు భారతీయధర్మమును, విజ్ఞానమును, శౌర్యప్రతాపములను గాపాడిన సామ్రాజ్యములందు విజయనగరసామ్రాజ్యము కడపటి సామ్రాజ్యము. మహమ్మదీయయుగమునందు దాక్షిణాత్యులశౌర్యప్రతాపములు, సాహిత్యవిజ్ఞానములు స్తంభించినవి. బ్రిటీషుయుగమునందుఁ జల్లబడినవి. విజయనగరయుగమునందు ఆంధ్రశౌర్యప్రతాప విలసితం ఆంధ్రావని వర్తమానకాలమునందుఁ దేజోవిహీ

హాసపాత్రమగుచున్నది. మానవులయభ్యుదయ పతనములకు స్వాతంత్ర్యపారతంత్ర్యములు సాధనంబులగు విధమును విజయనగరచరిత్రము విశదముచేయుచున్నది.

విజయనగరము - కర్ణాటాంధ్ర సంబంధము

విజయనగరసామ్రాజ్యము కర్ణాటసామ్రాజ్యము. విజయనగరము కర్ణాటకదేశమునందుఁ గలదు. ఆముక్తమాల్యద, పారిజాతాపహరణము, నారాయణవిలాసము, యయాతిచరిత్రము, రామరాజీయము, సంగీత సూర్యోదయము మొదలగుకావ్యములును శాసనేతిహాసములును కర్ణాటరాజ్యప్రశంసను జేసినవి. విజయనగరమును బరిపాలించిన సంగమ సాళువ తుళువ రాజుల వంశములవిషయమై కర్ణాటాంధ్రభేదాభిప్రాయములు గలవు. ఆవంశములు తెలుఁగువంశములైనను, కర్ణాటకవంశములైనను విజయనగరసామ్రాజ్య మాంధ్రవికాసమునకు సకలవిధములను వినియోగపడినది. ఆంధ్రదండనాయకులు విజయధ్వజములను స్థాపించిరి; మంత్రులు రాజ్యాభ్యుదయమును జేసిరి; కవులు కావ్యములను నిర్మించిరి; శిల్పులు కళాచాతుర్యమును బ్రదర్శించిరి; విద్వాంసులు విజ్ఞానవ్యాపనము చేసియుండిరి; రాజులు ధర్మసంరక్షణమును జేయు కర్ణాటాంధ్రులు కలిసి, జాతి కుల మత భేదాభి

మానములను పాటింపక విజయనగరసామ్రాజ్యమును గాపాడినవిధము వర్తమానసమయమునందు దేశసేవా పరాయణులకు గుణపాఠముగ నున్నది. కర్ణాటాంధ్రభాగములకు గల సన్నిహితసంబంధమును అక్షరామ్నాయములు, వాఙ్మయములు, సాంప్రదాయ మతాచారములు విశదము చేయుచున్నవి. శ్రీకృష్ణదేవరాయ లాముక్తమాల్యదయం దీభావమునే సందర్భానుసారముగ విశదము చేసియుండెను.

ఆ. తెలుఁగదేలయన్న-దేశంబు దెలుఁగేను
దెలుఁగు వల్లభుండఁ-దెలుఁ గొకండ
యెల్లనృపులు గొలువ-నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ-దెలుఁగు లెస్స.

ఆసన్నిహితసంబంధము భారతధర్మ సంరక్షణమునకు వినియోగపడినవిధమును విజయనగరసామ్రాజ్య చరిత్రమువ్యక్తము చేయుచున్నది. విజయనగరరాజులుమహామ్మదీయ ప్రతిఘటనమునందును, ధర్మాభ్యుదయమునందును జూపిన పరిజ్ఞానము విజయనగరచరిత్రమునందు గోచరంబగుచు బ్రజలకుఁ గర్తవ్యమును బోధించుచున్నది.

విజయనగరము-దేశవికాసము

విజయనగరరాజుల దిగ్విజయములు దక్షిణదిగ్భాగమును రెండువందలేండ్లు సామ్రాజ్యపాశబద్ధముచేసి విశ

సింప జేసినవి. కృష్ణానదికి దక్షిణమునందు గల దేశమంతి
యును, విజయవాడకును కటకమునకును మధ్య గల దేశ
మును విజయనగరసామ్రాజ్యమునందుఁ జేరినది. సుశిక్షి
తమైన సైన్యసహాయమును గలిగి విజయనగరాధీశులు
దేశరక్షణము జేసిన విధము వారి ప్రతిభకు నిదర్శనముగ
నున్నది. పరదేశీయులు చేసిన విజయనగరాభివర్ణనములను
హంపీశిథిలములు సహస్రముఖముల సమర్థించుచున్నవి.
మహావైభవముల ననుభవించిన విజయనగరము మహా
శ్మశానముగ మారుటకుఁ గారణంబులను నిర్ణయించుట
దుష్కరముగ నున్నది. భరతవర్షమునకు సహజములైన
జాతి మత కుల విభేదములు, వైరాగ్యము విజయనగర
పతనమునకును గారణంబులుగ బరిణమించినవి. స్వార్థ
పరత్వము, బహునాయకత్వము సంయోగబలమును దుర్ల
భముచేసి సామ్రాజ్యవినాశమును సులభసాధ్యము చేసి
నవి. జీర్ణవిజయనగరచరిత్ర మాంధ్రుల కాత్మసంస్మరణ
మును జేయుటకు సకలవిధములను దగియున్నది. ప్రతిభా
వంతులైన శ్రీ విద్యారణ్యస్వాములు, పెద్దనామాత్యుం
డు, శ్రీ కృష్ణదేవరాయలు, మంత్రి తిమ్మరుసు, రామ
రాజభూషణుడు మొదలగు మహానుభావుల పవిత్ర
చరిత్రము లాంధ్రప్రతిభను విశదము చేయుచున్నవి.
మహాశ్మశానరూపమున వెలయుచున్న జీర్ణవిజయ

నగరమందిరములు సందర్శనీయములై విషాదానందము లను గలుగజేయుచున్నవి. విజయనగరశిల్పము చాళుక్య మహమ్మదీయశిల్పముల సమ్మేళనమును గలిగి నవీనాకృతిని దాల్చినది. హజార రామదేవాలయము, అంబాలయము, కమలాలయము, ఏనుగుమహలు, అచ్యుతరాయ దేవాలయము, విఠలదేవాలయము పట్టాభిరామ దేవాలయములు విజయనగరశిల్పవైభవమును విశదము చేయుచున్నవి. విజయనగరవైభవమును జీర్ణవిజయనగరమునుజూచి యూహించుటసాధ్యముగాని పుస్తకమునందు ముద్రితములైనపటములనుజూచి యూహించుటసాధ్యము గాదు.

విజయనగరసామ్రాజ్యచరిత్రమును విశదముచేయు
"...ం శిథిలమందిరములు, శాసనములు, కావ్యములు, పర
...వ్రాతలు మొదలైన అపారమైన సాధనసామగ్రి
శ్రీయుత కృష్ణస్వామయ్యంగారి పీఠికతో
రంగస్వామి సరస్వతిగారు ప్రచురించిన
చరిత్రాధారములు" అను గ్రంథము పరి
ల సాధనసామగ్రిని విశదముచేయుచున్నది.
మారి ఈశ్వరదత్తుగారు రచియించిన జీర్ణ
త్ర మాంధ్రగ్రంథమాలయందు ఎనిమిదవ
న్నది. ఈకుసుమము విజయనగరసామ్రాజ్య

చరిత్రమునందును, జీర్ణవిజయనగర సందర్శనమునందును నభిరుచిని బుట్టించుటకు సాధనంబుగ నున్నది. ఈ చిన్ని పొత్తమునందు విజయనగరచరిత్రమును గ్రంథకర్త సంక్షేపముగను వివరించి ప్రజాలక్ష్యమును విజయనగరచరిత్రము నందు లగ్నముచేసినవిధము ప్రశంసనీయముగ నున్నది. ఆంధ్రులగతవైభవ సంస్మరణమునకును, భావిఫలోదయంబునకును దక్షిణదేశపరిజ్ఞానమునకును సాధనభూతంబైన జీర్ణవిజయనగర చరిత్రమున, కాంధ్రమహాజనంబు స్వాగతంబు నొసంగి కృతికర్తకును, ప్రకాశకులకును బ్రోత్సాహము నొసంగుదురు గాత!

ప్రభవ
కార్తీక బ. ౧౩ } కా. నాగేశ్వరరావు.
సోమవారము

# తొలిపలుకు

నేను శ్రీ పిఠాపురము రాజావారి కాలేజీలో నాల్గవఫారము చదువుకొను నపుడు అస్మన్మాతుల రచిత జీర్ణకర్ణాట రాజ్యచరిత్రము పఠించుటయు, నందలి యుద్రేకపూరితశైలియుఁ, గథావిధానమును నామనస్సు నాకర్షించుటయు సంభవించెను. నాటినుండియు నాకుఁ జరిత్రపఠనమన్న నుత్సాహమును, బ్రీతియుఁ గల్గెను.

కాకినాడ వదలి రాజమహేంద్రవర కళాశాలలోఁ బ్రవేశించిన తరువాత హైందవచరిత్రపఠనము నందే యెక్కువకాలము గడపితిని. నేను పట్టపరీక్ష యందుఁ గృతార్థుఁడ నౌసరికి ప్రాచీనహైందవచరిత్రము గుఱించి వ్రాయఁబడిన గ్రంథములన్నియుఁ గొంచెమో గొప్పయో చదువఁగలిగితిని.

తరువాత నుద్యోగవశమున బళ్లారిజిల్లాలో నొక వత్సరము నివసించుట కల్గెను. అపుడు జీర్ణవిద్యానగరసందర్శనభాగ్యము లభించెను. ఆ జీర్ణపట్టణరాజము కన్నులారఁ గాంచినతరువాత సామ్రాజ్యచరిత్రమంతయు సప్రమాణముగను, సమగ్రముగను వ్రాయవలె నను నభిప్రాయ ముదయించెను.

వెంటనే జీర్ణవిద్యానగరము వర్ణించుచు నొక వ్యాసమును భారతీపత్రికకుఁ బంపితిని. వ్యాసము ; శ్రీ దేశోద్ధారకులు తమకు గ్రంథమే వ్రాసి కోరిరి. నాసంకల్పము నెఱవేఱెడి మార్గము '

దేర్పఱచెననెడి యుత్సాహము కల్గి అత్యల్పకాలములో నీగ్రంథము రచించి వారికి సమర్పించితిని. వారికి నే నెల్లప్పుడును కృతజ్ఞుఁడను.

విజయనగర సామ్రాజ్యచరిత్రము వ్రాయుటకు మొదలిడితిని. సుమారు 2000 పుటలు గల గ్రంథము ఆంధ్రలోకమునకు స్వల్పకాలములో సమర్పించెదను. నామనమునం దెక్కుడాశయము లున్నవి. భాషాసేవయు, నద్దానిచే దేశసేవయు, దానివల్ల భగవదారాధనము నొనర్చుటకుఁ బ్రభుత్వోద్యోగ మెదురుచుక్క. అయినను సాహసించెదను.

ఈగ్రంథ నిబంధనమునందుఁ దోడ్పడిన అస్మన్మాతులునకును, శ్రీ సోమశేఖరశర్మగారికిని, శ్రీరంగస్వామి సరస్వతిగారికిని నామనఃపూర్వకమైన నమస్కారములు. ఈ గ్రంథమునం దుదాహరించిన తదితరగ్రంథకర్తలకును నేను కృతజ్ఞుఁడను.

ప్రమాదము పురుషలక్షణము. గ్రంథముద్రణకాలమునందు దూరదేశమున నుంటిని. గ్రంథప్రకాశకులు నాకుఁ దగినకాల మొసంగినను దోషములు సవరించుటకుఁ [illegible]రణాంతరములవల్ల వీలులేకపోయెను. పండితులు గుణశే గ్రహించెదరు గాక.

[illegible]ఖిపట్టణము
[illegible] బుధవారము

కుందూరి ఈశ్వరదత్తు

# విషయానుక్రమణిక

# చిత్రములు

౩౧. సమూలోని మహాసభామందిరము దక్షిణపువైపు

౩౨. ఎత్తైన యీకట్టడము లోటసుమహాలుదగ్గరనున్నది. దీనిపైనెక్కి—శత్రువుల రాకపోకలను కనిపెట్టుచుందురు.

౩౩. రాచనగరు—తూర్పువైపు

౩౪. ఏనుగులశాలలు

౩౫. ఏనుగులశాలలు—ముందరిభాగము

౩౬. కావలివాండ్రగృహము (ఠాణా)-దక్షిణపువైపు

౩౭. దుర్గమునకు తూర్పునందు ముఖద్వారము-కోట తూర్పువాకిలి

౩౮. పట్టాభిరామ దేవాలయమునకు చెంతనున్న కోటవాకిలి, బురుజు-దక్షిణవైపు

౩౯. హంపికోట గోడయందలి ముఖద్వారము

౪౦. నీరు ప్రవహించెడు రాతితొట్లు

౪౧. పట్టాభిరామదేవాలయమునకు తూర్పుభాగముననుండు ధ్వంసములైన శివ, విఘ్నేశ్వర దేవాలయములు

౪౨. పట్టాభిరామదేవాలయమునకు చెంత పాడుపడిన కోనేరు

౪౩. కోనేటిగట్టున పడిపోయిన శిలాస్తంభములు

౪౪. ఆనెగొందికోట ప్రధానద్వారమువద్ద తుంగభద్రానది - దక్షిణవైపు.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒ |
|---|---|---|---|
| 3 | 20 | దండెత్తఁబడెను. | దండెత్తి |
| 9 | 16 | శంఖు | శంకు |
| 29 | 10 | దులతూఁగి | దులఁదూఁగి |
| 38 | 3 | గలసి | గలపి |
| 40 | 6 | ఁగుత్తైటంగి | గుత్తైటంగి |
| 56 | 3 | పూర్వము | పూర్వ |
| 58 | 11 | స్వంత | సాంత |
| 65 | 14 | సాంపరాయనికి | కంపరాయనికి* |
| 67 | 14 | ప్రతిష్టాపించి | ప్రతిష్ఠించి |
| 84 | 15 | ,, | ,, |
| 95 | 5 | కట్టుచుండిరి. | కట్టుచుండిరి అని వ్రాయుచున్నాఁడు. |
| 121 | 5 | దుస్థితి | దుస్స్థితి |

* ఈ తప్పొప్పులను దిద్దియిచ్చిన విశాఖపట్టణ వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. వీరికడ నున్న ఆనందగజపతి గ్రంథాలయమునందున్న ప్రతిలో 'కంపరాయనికినిచ్చె' యున్నది. శ్రీశాస్త్రిగారు చెప్పినట్లు ఈపాఠాంతరమే సరియైనది.

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 14 | దీప్తిబలంరి | దీప్తిబలశ్రీ |
| 5 | శిక్షలనొ | శిక్షలపై |
| 1 | పశ్చిమమున | ఈశాన్యమున |
| | పత్తూరెండ్రి | పెంపుమీరెండ్రి |
| | శేనగగింజ | సెనగగింజ |
| | చేతిలోఁ | చేతిలోఁ బూలనాలను |
| 5 | రాజపునరుద్ధారులని | పునరుద్ధారకులని |
| | Annual Report on Epigraphy 1906, para 63. | Annual Report on Epigraphy 1900, para 63. |
| 119 | Epigraphia Indica, vol. III, No. 121. | Epigraphia Carnatica, vol. III, M. L. No. 121. |

---



౨. కృష్ణస్వామి దేవాలయము

7

# జీర్ణవిజయనగరచరిత్రము

౧

ఏపట్టణ రాజము సుప్రసిద్ధమగు విజయనగర సామ్రాజ్య
లక్ష్మీనివాసస్థానమో, యేనగరాధీశులు దక్షిణ
హూస్థానమంతయు నేకచ్ఛత్రాధిపత్యమునఁ బరిపాలిం
యేపురవతంసము దక్షిణాపథమును చంద్రధ్వజుల
ౕడకుండగ రెండువందలయేఁబదియేండ్లు చెక్కుచెద
...షించెనో, యేపురవరంబు పదునైదవ పదునాఱ
దుఁ బాశ్చాత్యపథికులచే సందర్శింపఁబడి,
...ర్యమునందును, వైభవమునందును బశ్చిమ
...లి రాజధానీనగరము లేవియు సాటిరావని
...చెనో యట్టి మహానగర మీ కాలమున నా
...ౕ, యది యున్నప్రదేశ మిప్పుడు బళ్లారి
హాస్పేటకు నేడెనిమిదిమైళ్ల దూరమున తుంగ

భద్రానదీతీరమున 'హంపి' యనుకు గ్రామమునకు సమీ
మున "హంపి శిథిలము" లని పిలువఁబడుచున్నది.
ఆహా! సర్వేశ్వరుని సంకల్పములు భావాతీతములు గదా!
అట్టి విద్యానగరముయొక్క నిర్మాణవిధమును, దానిని
బాలించిన భూపాలుర యుదంతమును, దానిపూర్వవిస్తీ
వైభవాది విషయములను, నేయాంధ్రుఁడు పఠించుటకు
గుతూహలమును జెందఁడు? ఆ మహానగర మొక్క
సమయమున ముష్కరులగు తురుష్కుల హస్తగతమై
విధ్వంసము గావింపఁబడిన విషయ మేయాంధ్రుని విచా
సాగరమున ముంచదు?

పదునాల్గవశతాబ్దారంభమున
దక్షిణ హిందూస్థానమునందలి పరి

పదుమూఁడవశతాబ్దాంతమున న
యుఁ గ్రమక్రమముగా మహమ్మదీయుల
హిందూసామ్రాజ్య రమారమణీమణి చం
శ్రయమునొల్లక, నిలువనీడ లేక, చిట్టచివఱకు
దాటివచ్చి శూరాగ్రేసరులగు దక్షిణహింద
న్న పరిపాలకుల నాశ్రయించెను. వీరు మాత్రవ
ప్రతాపములచే మహమ్మదీయుల నెవ్విధ

ల రాజ్యము బలహీనమై మహమ్మదీయుల యొత్తిడికిఁ గొల్పడియెను. క్రీ. శ. 1327 సంవత్సరమున హోయిసల రాజ్య రాజధానియైన ద్వారసముద్రము ధ్వంసముగా వింపఁబడెను.[1] ద్వారసముద్రము నేలుచుండిన మూఁడవ భల్లాలదేవుఁడు మహమ్మదీయుల ప్రతాపాగ్నికిఁ దాళఁజాలక క్రీ. శ. 1342 సంవత్సరప్రాంతమునఁ దన రాజధానిని దక్షిణఆర్కాడుజిల్లాలోని తిరువన్నామలకు మార్చుకొనెను.[2] ఇతఁడు క్రీ. శ. 1343 వఱకు హోయిసలరాజ్యమును బాలించినట్లు తెలియుచున్నది. ఇట్లు మహమ్మదీయ విజృంభణమునకుఁ దాళలేక హిందూరాజ్యలక్ష్మి భయార్తయై, యార్యావర్తము నుండి పాఱివచ్చినను దనకుపాట్లుతప్పలేదని యెంచి తలఁదాచుకొనుటకుఁ జోటులేక దక్షిణత్రిలింగ కర్ణాటభూతలమునందు తనమానప్రాణ రక్షణార్థము పఱువులిడుచుండెను. ఆంధ్రసామ్రాజ్య మస్తమించినపిమ్మట ప్రతాపరుద్రుని కోశాగార రక్షకులగు ‘హరియప్ప, బుక్కప్ప’ అను సోదర శిఖామణులు తుంగభద్రాస్రవంతికి ఉత్తరభాగమున నున్న ఆనెగొంది పురాధీశ్వరుఁడగు జంబుకేశ్వర రాయల నాశ్రయించి యతనియొద్ద మంత్రిత్వమును సంపాదించు

1. Bombay Gazetteer, vol. I, part ii, p. 509-510.
2. Mysore Gazetteer, vol. I, p. 342.

కొనుట సంభవించెను. ఆకాలమున దక్షిణహిందూ దేశమునకు రాజప్రతినిధిగా నియమింపఁబడిన 'బహ ఉద్దీన్' అనువాఁడు చక్రవర్తిని (మొగలు) ధిక్కరించి స్వతంత్రుఁడై పరిపాలనము చేయుచుండెను. అంత మొగలు చక్రవర్తియగు మహమ్మద్‌తుఘ్లఖ్ చక్రవర్తి కోపోద్దీపితుఁడై ఘూర్జరదేశపు రాజప్రతినిధియైన 'ఖాజా జెహా' అనువానిని'బహాఉద్దీన్' ను శిక్షించుటకుఁ బంపఁగా 'బహాఉద్దీన్' చక్రవర్తి సైన్యములను గెలువలేక పాఱి వచ్చి దురదృష్టవంతుఁడగు జంబుకేశ్వరరాయల శరణు వేఁడెను. జంబుకేశ్వరరాయ లతనికి అభయహస్తమిచ్చెను.ఆసమాచారము విని మొగలు చక్రవర్తి యసంఖ్యాకములగు సైన్యములంగూర్చుకొని జంబుకేశ్వర రాయలపై క్రీ. శ. 1334 సంవత్సరమున దండయాత్ర వెడలివచ్చెను. అంతవీరిద్దఱకును ఆనెగొందికి సమీపముననున్న కంపిలా నగరము (Kampli in Bellary ) దగ్గఱ ఘోరయుద్ధము జరిగెను. జంబుకేశ్వరరాయలు మృతుఁడయ్యెను. ఆనెగొందియుఁ దురుష్కుల వశమయ్యెను. హరియప్పయు, బుక్కప్పయుఁగూడఁ దురుష్కుల వశమైరి. ఢిల్లీచక్రవర్తి యానెగొందిని వశముచేసికొని 'మల్లిక్‌సాయబు' అనువానిని ప్రతినిధిగ నేర్పఱచి స్వదేశమునకు వెడలిపో

యెను. కాని వెంటనే ప్రజలు తిరుగఁబడుటయు 'మలిక్ సాయబు'నకు స్వాతంత్ర్యప్రియులగు ప్రజలను బరిపాలించుటకు శక్యము గాకపోవుటయుఁ జూచి ఢిల్లీచక్రవర్తి కారాగారమునం దుంచఁబడిన సోదరశిఖామణుల నిరువుర వదలి, హరిహరున కారాజ్య మొసంగి యతనినిఁ దనకు సామంతుఁడుగ నుండున ట్లొప్పించుకొని, 'మలిక్ సాయబు'ను స్వదేశమునకు రప్పించుకొనెనట. [1] వీరబల్లాలదేవుఁడు హొయిసలరాజ్యమును పేరునకు మాత్రము క్రీ. శ. 1343 వఱకుఁ బరిపాలించుచుండినట్లు [2] పైన వ్రాసియుంటినిగదా. ఆనెగొంది హొయిసలరాజ్యములోనిదే యైనను హరిహరరాయలును సోదరుఁడును స్వతంత్రులై క్రమక్రమముగా రాజ్యమును వృద్ధిపఱచుకొనుచుండిరి. వీరి రాజ్యము క్రీ. శ. 1336 సంవత్సరము నాఁటికిఁ బశ్చిమతీరము వఱకును వ్యాపింపఁజొచ్చెను. పశ్చిమతీరమం దున్న బైరసు ఒడయరులు

---

1. (ఎ) ఈగాథయంతయు 'ఇబన్ బతూతా' అను మహమ్మదీయ చరిత్రకారుఁడు క్రీ. శ. 1333 సంవత్సరము హిందూదేశమును జూడ వచ్చి, యీదేశమున తొమ్మిదిసంవత్సరములు సంచారముచేసి వ్రాసియుంచిన యంశములనుండి గ్రహింపఁబడినది. Ibn Batuta Travels, vol. III, p. 318-320

(బి) Sir Henry Elliot's History of India, vol. III, pages 615 - 616.

2. Annual Report on Epigraphy, Page 51, 1906-07.

వీరికి లోఁబడిరి. బరుకూరు అను ప్రదేశమున హరిహరుడు కోటనొక్కటి గట్టించెను.[1] అదియుఁగాక 'ఇబ్న బతూతా' అను మహమ్మదీయచరిత్రకారుఁడు తనకాలమునాఁటికే (1339-1342) పశ్చిమతీరమం దున్న హొన్నూరు మహమ్మదీయనాయకుఁడు హరిహరరాయలకు సామంతుఁడుగ నుండెనని వ్రాయుచున్నాఁడు.[2] ఈ యాధారములంబట్టి హరిహరునకును బల్లాళదేవునకును సంబంధము లేదనియు, హరిహరుఁడు స్వతంత్రుఁడనియుఁ దెలియుచుండఁగా రావుసాహేబు కృష్ణశాస్త్రిగారు హరిహరరాయలు బల్లాళదేవునికి సామంతుఁడుగ నుండవచ్చునని యూహించుట పొరపాటు.[3]

విద్యానగర నిర్మాణము

పైనివివరింపఁబడిన ప్రకారము మహమ్మదీయ విజృంభణము దక్షిణాపథమునఁ గొంతకాలము తగ్గిన తరువాత, హరిహరాదుల పాలనమున ప్రజ లల్లకల్లోల

1. South Canara Manual, vol. I, page 55.

2. Forgotten Empire, page 7.

3. It is not ascertained as yet from epigraphical records what definite position these chiefs held under the Hoysalas but that they were powerful enough to exercise much influence in the Hoysala kingdom long before they could declare their independence is proved by certain known facts H. S. R., 1907-1908, page 235.

ములు లేక విశ్రాంతిని గాంచుచున్న సమయమున హిందూరమారమణీమణియుఁ గొంతతడవు పరిస్థితుల నవలోకించి, చిట్టచివఱకు హరిహరాదుల భుజాపీఠి నధిష్ఠింప దొరఁకొనెను. ఆనెగొందిలో పరిపాలనము చేయుచుండగా హరిహరరాయ లొకనాఁడు వేఁటకై పరిసరారణ్యములకుఁ బోయి తుంగభద్రానదికి దక్షిణతీర మందు విహరించుచుండెనట. ఆ ప్రదేశమున కుందేళ్లకు జంకి వేఁటకుక్కలు పఱువెత్తుచుండుటనతఁడు విలోకించి,యా యత్యద్భుతవిషయమును మాధవవిద్యారణ్యులను యతీశ్వరులకుఁ జెప్పఁగా నాయన యాస్థలమున నొక్కనగరమును నిర్మించినచో మిగుల జయప్రదముగ నుండుననిచెప్పెనట. అంతట హరిహరరాయ లాప్రదేశమున మాధవ విద్యారణ్యులవారి యాజ్ఞానుసారముగ విద్యారణ్యుల పేరిటనే విద్యానగరమని పేరుపెట్టి శా. శ. 1258 ధాతృ నామసంవత్సర వైశాఖశుద్ధ సప్తమినాఁడు పుష్యమీ నక్షత్రయుక్త సింహలగ్నమున శంఖుస్థాపనము గావించి పురనిర్మాణము గావించెనట. ఈవిషయము [1]నూనిజ్ అనుచరిత్రకారుని వ్రాఁతలవల్లనేకాక శాసనాధారమువల్ల

(1) Nuniz—Chronicle, Chapter IV, Page 299.
Vide Forgotten Emptre, Page 292.

గూడ స్థిరపఱుపఁబడినది. [1]హరిహరరాయల కాపలూరు శాసనమునందు పైనివివరింపఁబడిన వృత్తాంతమంతయుఁ దెలుపం బడినది. ఈ శాసనములోని నందినాగర్యక్షరములు మిక్కిలినవీనములుగా నుండుటచేత నిది కల్పిత శాసనమని శాసనసంపాదకు లభిప్రాయపడి యున్నారు.[2] ఈ శాసనమునందు హరిహరరాయలు పంపావిరూపాక్షమహేశ్వరుని సన్నిధానమున విశ్వామిత్రగోత్రుఁడును, ఆశ్వలాయన సూత్రుఁడును, ఋక్శాఖాబ్రాహ్మణుఁడును నగు కేశవభట్టుకుమారుఁడు నగు అనంతసూర్యనార్యునకు చంద్రగిరి రాజ్యములోని పడనాటిసీమయందలి సువర్ణముఖి నదీతీరమున నున్న కాపలూరు గ్రామమునకు హరిహరపురమని నామకరణమునుజేసి యగ్రహారముగా ధారపోసియిచ్చెను. ఈశాసనములోని ముఖ్యభాగముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

అస్యాంబురాశేః కులతంతురిందుః...............

---

1-Nellore Inscriptions.—Kapalur grant P. 109-125

2. The character is Nandinagari but the formation of the letters is quite modern and in certain letters it is very similar to Devenagari. This fact shows that the document is a fabrication Nellore Inscriptions. Vol- I, Page 109.

సార రాయకంపధరణీపతి బుక్క మహీ
రెవృఢమారభూరమణ ముద్ధనృపాఃఖలు తే;
గుణేషు తేషు నవఖండమహేశ్వరతా
నజత పూర్వజ స్సతు యుధిష్ఠిరవ న్మహాసా.

*     *     *     *

దు త్తీర్య స తుంగభద్రాం
క్షమాధిపాలో మృగయాభిలాషాత్;
అసాద్య సైన్యై స్సహతీర మస్యా
స్తదక్షిణం కాననమీక్షతోఽస్య. 20
తస్మి న్వనే కంచన సారమేయ
సందంశనైకాగ్ర రతాగ్ర ముగ్రమ్;
ససంగమాన స్తశశం శశీంచ
విసిస్మయే వీక్ష్య దిశామధీశః. 21
క్షోణీపాలో హరిహరఇతి
శ్రీవిరూపాక్షదేవం;
పంపాదేవీ సహచర మిమం
వీక్ష్య భక్త్యాచ నమ్రః;
సన్మూర్తిం తం మహితతపసం
తస్య దేవాలయాంతే
విద్యారణ్యం యతి మభజత
శ్రీమహేశాన మన్యమ్. 22

ప్రణాయ్య తస్యాంతిక సీమ్ని భక్త్యా
తపోనిధిం జ్ఞానకళానిదానమ్
వృత్తాంత మత్యద్భుతహేతు మేనం
విజ్ఞాపయామాస విశేషవంద్యమ్.
త్రికాలవిజ్ఞాననిధి ర్యతీంద్రో
విహస్య కించి త్త ముపాచ వీరమ్
రాజర్ష మహారాజ కులాసికార్హా
సీమేయమత్యంత బలైకమూలా. 24
విద్యాభిధానా మలకానవద్యాం
ఇరావనం నామ పురీం విదధ్యాః;
.........................................
.................భవానితి త్వమ్మాపతి మాదిదేశ. 26
తథా హరిహరేశ్వరస్య విరచయ్యతచ్ఛాసనం
నృపాసనముపాస్థితో చ్ఛితసితాతపత్రోజ్వలః;
విధాయ ఖలు షోడశాప్రతినిధీనిదానా న్యహో
వ్యరాజత విశాలసీమ్ని నగగేహి విద్యాభిధే.
అష్టపంచయుగళైక సంఖ్యయా
సంయుతే నృపశకస్యవత్సరే. 28
పట్టాభిషేకోత్సవతః పరస్తాత్
పంపావిరూపాక్ష మహేశ్వరస్య

సత్సన్నిధౌ సత్యపరాక్రమస్తు
చక్రే మహాన్ భూపతి రగ్రహారమ్.
శంకు కేశవభట్టస్య సూనవేఽనంతసూరిణే
కాపలూరు మహాగ్రామం......
హరిహరమహారాయో.........
సహిరణ్యపయోధారాపూర్వకం దత్తవాన్ ముదా[1]

శాసనము విశ్వాసార్హమైనదికాదని సంపాదకు లభిప్రాయపడియున్నను దీనినే ప్రమాణముగాఁగైకొనవచ్చునని యు, నిది క్రమమైనదనియు దొరతనమువారి శాసనపరిశోధకులగు రావుబహదరు వెంకయ్యగారు సకారణముగనిరూపించియున్నారు.[2] శ్రీ వెంకయ్యగారేమివ్రాసిరో యీక్రింద నుదాహరించుచున్నాను. "మనయెదుటనున్న సంపుటములో విజయనగరమునకు సంబంధించిన శాసనము కాపలూరుశాసనమైయున్నది. ఈశాసనము మొదటి హరి

1. 18, 20, 21, 22, 23, 24, 26, 28, ఇవి శ్లోకముల సంఖ్యలు. ఈశాసనమునందు 50 శ్లోకములుగలవు. గ్రామము యొక్క సరిహద్దులు తెల్పు కొంతతెలుగుభాగముకూడ చివఱనున్నది.

2. Ancient History of Nellore District—Indian Antiqury Volume XXXVIII—Page 89-91. Justification of Kapaluru grant — ఆంధ్రులచరిత్రము మూడవభాగమున పుట 321 - 324 లలో ఈవిషయము భాషాంతరీకరింపఁబడినది.

హరిహరరాయలకాలములో శా. శ. 1258 ధాతృనామసంవత్సరమునకు సరియైన క్రీ. శ. 1336-37 సంవత్సరములో వ్రాయఁబడినది. ఈసంవత్సరములోనే విద్యానగరము నిర్మింపఁబడెనని న్యూనిజ్ వ్రాసియున్నాఁడు. తరువాత శాసనములఁబట్టి వంశమునకు మూలపురుషుఁడైన సంగముఁడు బుక్కరాజునకు మేణాంబికకుఁ బుత్రుఁడని తెలియుచున్నది. కాపలూరు శాసనమున చంద్రవంశమున బుధుఁడు, ఆయువు, నహుషుఁడు, యయాతి, యదువు మొదలగువారు జనించిరనియు, వారివంశమున జనించిన సంగమునకు గాలాంబికయను భార్యవలన హరియన్న, కంపన్న, బుక్కన్న, మారన్న, ముద్దన్న యనునేవురు పుత్రులు జనించిరనియు, వారిలోఁ బెద్దవాఁడైన హరిహరుఁడు అంగకళింగాదిదేశములను జయించి కుంజరకోనలో (ఆనెగొంది) నుండి పరిపాలనము చేయుచుండెననియుఁ జెప్పఁబడినది. ఆనెగొంది తుంగభద్రానదికి ఉత్తరపుటొడ్డున నుండెను. విద్యానగరము యొక్క శిథిలములైన ప్రదేశములన్నియు దానికెదురుగ దక్షిణపుటొడ్డునఁ జేరియున్నవి. ఒకప్పుడు హరిహరరాజు వేటకై బయలుదేరి నదినిదాటి నదికిదక్షిణమున నొక యరణ్యమును గాంచెనని శాసనము తెలుపుచున్నది. అచ్చట

నొక కుందేలు వేటకుక్కను మార్కొనఁ
విద్యారణ్యాశ్రమమునకుఁ జని యా వింతవృ
స్వామికి నివేదించి యందుల కేమికారణమని
చెను. అయ్యది మహారాజులకు నిలయముగా
దగిన స్థలమని యామహానుభావుఁడు తెల్పెను.
మీఁద నతఁడు విద్యానగరమును నిర్మించెను. పట్టా
షేకమైన పిమ్మట రాజు కాపలూరుగ్రామ మగ్రహా
ముగా నొసంగెను. ఈశాసనకాల మిదివఱకుఁ గాన
పించిన హరిహరుని శాసనకాలముకంటె మూఁడుసంవ
త్సరములు పూర్వపుదియైయున్నది. లిపిలోని భేదమును
బట్టి యీశాసనము నమ్మదగినదికాదని సంపాదకు లభి
ప్రాయపడుచున్నారు.

మొదటిసంగమునితండ్రి రైసుగారు (Rice) ప్ర
రించిన మూఁడు శాసనములలోను వక్కాణింపఁబడియె
ను. అందొకశాసనము మొదటి హరిహరుని కాలములో
నిది. తక్కిన రెండుశాసనములును మొదటి బుక్కరా
యని కాలములోనివి.

ఇచ్చట సంగమునిభార్యయొక్కయు, తల్లియొక్క
యు, నామములుకొంచెము మార్పుతో నున్నవి. మొదటి
శాసనముయొక్క మాతృక లేదు; కాని దాని నకలు

...సుదొరగారు ప్రచురించిరి. కాపలూరు శాసన
...యమున జనించినదో, యేయావత్సరముననే యీ
పుట్టినది. తక్కిన రెండు శాసనముల కాలములో
. 1266 తారణనామసంవత్సరమునకు సరియైన
శ. 1344-45 సంవత్సరముగా నున్నది.

కడపటి రెండు శాసనములలోను ప్రతిగ్రహీత య
...శ్వాశీయుఁడును, ఆపస్తంబ సూత్రుఁడును, భారద్వాజగో
త్రుఁడును నగు నాచనసోమయ యనునాతఁడు. అతఁడు
...నాచనపుత్త్రుఁడును, సకలాగమవేదియు, అష్టాదశపురాణా
భిజ్ఞాతార్థవేదియు అష్టభాషాకవిత్వశ్రీయు నగువాఁడుగా
...ంచును. ఇతఁ డాంధ్రకవియైన నాచనసోముఁడు కానోపు.
...డటి శాసనమైన బాగేపల్లి శాసనములోని మొదటిశ్లోక
మొదలుకొని యిరువది యనిమిదవశ్లోకమువఱకును,
కాపలూరు శాసనములోని రెండవశ్లోకము మొదలుకొని
యిరువదితొమ్మిదవ శ్లోకమువఱకునుగల శ్లోకములకు భేద
మేమియును లేక విద్యారణ్యస్వాముల ప్రేరణముననే
హరిహరరాయలచే విద్యానగరము నిర్మింపఁబడెనని తెలి
యఁజేయుచున్నవి. కడపటి రెండు శాసనములుకూడ
విద్యానగరము విద్యారణ్యకృతమని తెలుపుచున్నవి.
కాపలూరు శాసనములోను రైసుగారు ప్రకటించిన



3. కృష్ణస్వామిదేవాలయ మహామంటపముయొక్క ద్వారము



౮. కృష్ణస్వామిదేవాలయ మహామంటపముయొక్క
ఆగ్నేయభాగపు చూరు

163

18

బుకానన్ పండితుఁడు 'విద్యారణ్యాశిష' యను నొక సంస్కృత గ్రంథములో 'హక్క' 'బుక్క' యను నిరువురు సోదరులు ప్రతాపరుద్రుని ధనాగారరక్షకులుగ నుండి పాఱిపోయి విద్యారణ్యుల నాశ్రయించి యాతని సహాయమున నూతన సామ్రాజ్యమును నెలకొల్పి విజయనగర పట్టణమును నిర్మించెనని వ్రాయఁబడి యున్నదనియు, తానా గ్రంథమును మైసూరులో క్రీ. శ. 1801 సంవత్సరమున వార్మికరామప్ప యను బ్రాహ్మణుఁ డా గ్రంథమును దనకుఁ జూపెననియు వ్రాయుచున్నాఁడు.* ఇట్లు శాసనముల వల్లను, మహమ్మదీయచరిత్రకారులవల్లను, స్థానికగాథలవల్లను, పాశ్చాత్యచరిత్రకారుల వ్రాఁతలవల్లను విద్యానగరము విద్యారణ్యుని ప్రేరణముచే మొదటి హరిహరరాయలు నిర్మించినట్లు స్పష్టముగా నుండఁగా స్వదేశీయ చరిత్రకారులు కొందఱు వింతవ్రాఁతలు కొన్ని వ్రాయుచున్నారు. విజయనగర సామ్రాజ్యచరిత్రమును వ్రాసిన శ్రీసూర్యనారాయణరావుగారు ఆనెగొంది పురాధీశ్వరుఁడైన విజయధ్వజుని కాలమునాఁడు విజయధ్వజుని పేరిటనే విజయనగరము నిర్మింపఁబడినట్లును, అయ్యది విద్యారణ్యుల ప్రేరణముచే విస్తరింపఁబడిన దగుటచే విద్యా

* Buchanan's-Travels in Southern India, 'Mysore' III, Page 110.

నగరమని మఱియొక నామ ముంచఁబడి కర్ణాటరాజులకు రాజధానిగఁ జేయఁబడినదని వ్రాయుచున్నారు.* శ్రీ జయంతి రామయ్యపంతులవారు తమచే వ్రాయఁబడిన 'కర్ణాటరాజ్య కథాసార' మను వ్యాసమునందు "'విద్యాస్థాన'మను నూహచే విద్యానగరమనియు, విజయమున కాకరమను నూహవలన విజయనగరమనియు నామములు కల్పింపఁబడిన ట్లూహింపఁ దగియున్నది. విద్యారణ్యుల ప్రోత్సాహమువలనను, సాహాయ్యమువలనను, గట్టినదగుటచే విద్యానగరమను పే రాపట్టణమునకు వచ్చినదని యొక వదంతి. అయినను గావచ్చును........తదనంతర మాతనికొడుకు ఇమ్మడిహరిహరరాజు రాజయ్యెను. (రెండవహరిహరరాయలు) ఈతనికాలమందె విజయనగరము కట్టినట్లు కనుపట్టుచున్నది."† అని వ్రాసియున్నారు. వీరిద్దఱి యభిప్రాయములును భ్రాంతిమూలకములైనవనియు,

---

* Raya Vamsali ascribes the founding of Vizianagar to Vizayadwaja, the secend son of Chalukya Maharaja who ruled in Kiskinda. Vidyaranya called the revived city Vidyanagar after his own name and apparently must have ruled there without any king for about ten years. Never to be forgotten Empire, Page 15.

† ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక—సంపుటము 4. సంచిక 3, పేజీలు 99-101.

నిరాధారములనియు పై నుదాహరింపఁబడిన యాధారములమూలమున నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

విద్యానగరము—విజయనగరము

విద్యారణ్యుని ప్రేరణముచే నిర్మింపఁబడుటచే యీ పట్టణమునకు విద్యానగరమని పేరువచ్చెనని పైన నిరూపించియున్నాఁడను. కాని క్రమక్రమముగా శాసనములలోనేమి, గ్రంథములలోనేమి, వాడుకలోనేమి విద్యానగరమునకు విజయనగరమని పేరువచ్చెను. హరిహరరాయలచే విద్యానగరమునకుఁ బ్రప్రథమమున శంకుస్థాపనము గావింపఁబడినను నిజముగా నగరనిర్మాణము హరిహరరాయల తరువాత నతని సోదరుఁడగు బుక్కరాయల కాలమున జరిగియుండి విద్యానగరమునకు విజయనగరమను నామముకూడ వచ్చియుండవచ్చును.* బుక్కరాయని శాసనములలో నొకదానియందు బుక్కమహీమతి ప్రపంచమునంతయు జయించిన తరువాత విజయనగరమును నిర్మించి క్షోణీజనరక్షణార్థము విరూపాక్షుని వలె

* Rice, Mysore and Coorg, from Inscriptions, P- 113. Though the establishment of the capital is attributed to Harihara and his naming it Vidyanagari after Vidya ranya Sripada, the building of the city and the transformation of its name to Vizayanagari or City of Victory are said to have been the work of Bukkaraya.

తుంగభద్రానది పాదపీఠముగను, హేమకూటము సింహాసనముగను జేసికొని యాసీనుఁడై యుండెనని తెలుపఁబడినది.* శాసనములోని వర్ణన ప్రకారము బుక్కభూపాలుఁ

* Epigraphia Carnatica, Vol. V, No. 256, P. 520

(1) సామ్రాజ్యలక్ష్మీం అధిగమ్య తస్మాత్
శ్రీబుక్కరాజో విజయోర్జితశ్రీ
యో భూతభావిక్షితి పాలజాలం
అ—త్యక్రమీద్ విక్రమవైభవాభ్యాం.

(2) సర్వాఖర్వఫలోత్తరా వసుమతీ నిస్కంటకోత్తంటికా
నిశ్శేషీభవదీతిభీతిర్ అమితోపర్యోక్కవితర్కోజ్ఝితా;
జాతస్ఫీతజనోత్సవో జనపద స్సంపత్సమృద్ధా స్సదా
యస్మిన్ బుక్కమహీపతౌ సమభవద్ విశ్వంభరారక్షకే.

(3) దిగంతాద్రిషు యద్దంతిపంతౌఘటక్షుక్షా లయా
యద్దిగ్గజయజయస్తంభ బిరుదావళీవద్ బభౌ.

(4) విజిత్య విశ్వాం విజయాభిధానాం
విశ్వోత్తరాం యో నగరీం వ్యధత్త;
యా హేమకూటాం నిజసాలబాహు
లతోచ్ఛ్రితేనేవ పరిష్వజంతి.

(5) యత్ప్రాకారశిఖావళీ పరిలసత్ కింజల్కపుంజాచితాం
యచ్ఛాకాపుర పుష్పజాలనిచితం సద్దంతిభృంగాన్వితి;
స్ఫాయద్ యత్ పరిఖాజల ప్రతిఫలద్ యత్ప్రాంతపృథ్వీధరో
ఛాయానాలంఇదం పురాబ్జం అనిశం లక్ష్మ్యా సమాలంబతే.

(6) యత్తుంగభద్రాంచిత పాదపీఠం
భద్రాసనం భాసుర హేమకూటం;
క్షోణీజనానాం పరరక్షణార్థం
తస్మిన్ విరూపాక్ష ఇవాద్యతిష్ఠత్.

డనన్యసామాన్య పరాక్రమవంతుఁడనియుఁ నితనివలననే పట్టణము సకల విజయార్జిత వైభవసమన్వితమైనదనియు విశదపరాచుండుటచేత నితనికాలమునందె యీనగరమున కీనామము వచ్చియుండెననుటకు సందేహము లేదు. బుక్కరాయనికొడుకగు కంపభూపతిభార్యయైన గంగాదేవిచే రచింపఁబడిన కంపరాయచరిత్రమను నామాంతరము గల మధురవిజయమను గ్రంథమున బుక్కరాయలువిజయార్జిత సంపదకు నిలయమైన విజయనగర మను నామము గల ..గరమును రాజధానిగ నేలుచుండెనని వర్ణింపఁబడెను.[1]

ము విజయనగరముకూడ వర్ణింపఁబడెను.

బుక్కరాయనిశాసనమునుబట్టియుఁ గంపరాయ త్రమునుబట్టియుఁ గూడ బుక్కరాయనికాలముననే

1. Kamparaya Charitram, Canto I. (Sources of ..anagar History, Page 24).

ఆసీత్సమస్తసామంత మస్తకన్యస్తశాసనః,
బుక్కరాజఇతి ఖ్యాతో రాజా హరిహరానుజః.
తస్యాసీద్విజయానామ విజయార్జితసంపదః,
రాజధానీ బుధైః శ్లాఘ్యా శక్రస్యేవామరావతీ.
సురలోకాంతసంక్రాంత స్వర్ణదీమత్సరాదివ,
పరిఘాకారతాం యాన్త్యా పరీతా తుంగభద్రయా.
యచ్ఛాకానగరీం రమ్యాం అనేకఘనదాశ్రితాం,
అధితిష్ఠ న్నిహాపాక్షో న స్మర త్యలకాపురీమ్.

విద్యానగరమునకు విజయనగర మనునామము విజయాశ్రీజ
సంపదకు నిలయమౌటచేఁ గల్గెనని స్పష్టమౌచున్నది.

## స్థలమాహాత్మ్యము

ఏస్థలమునందు విద్యానగరము నిర్మింపఁబడెనో
యాప్రాంతమునందే, కొన్నివందల శతాబ్దముల క్రిందట
నొక్కనగర ముండవలయునని స్థానికగాథలవల్లను, పురా
ణములవల్లను దెలియుచున్నది. ఈప్రాంతమునందే పూ
ర్వము రామాయణమునందలి కిష్కింధాకాండము నందు
వర్ణింపఁబడిన రంగము లన్నియుఁ బ్రదర్శింపఁబడె
పండితు లభిప్రాయపడుచున్నారు. రామాయణము నం
కిష్కింధ యనునది యీ విజయనగరమునకు సమీ
మున నుండవలయుననుటకుదృష్టాంతముల నేకములున్న
హాంపీప్రాంతమే కిష్కింధ యని రైస్ (Rice), భాం
కార్ పండితులు సప్రమాణముగా నిరూపించి య

---

1· Bellary Gazetteer Page 260.

If legendary History and local tradition be ted there was a town on this site many centuries b the Kings of Vizayanagar selected it for its capital. of the most dramatic scenes in the great epic of yana occured at a place colled in the poem, Kis and it is asserted by the local Brahmins and ger acknowledged by the learned in such matters th Kiskinda is close to Hampe.

రు.[1] ఈసంగతి తెలియక కాంబోలు పండితసింహులు, విమర్శకాగ్రగణ్యులు నగు శ్రీ వజ్ఝల చినసీతారామ శాస్త్రులవారు తమచే విరచింపఁబడిన వసుచరిత్ర విమర్శనమునందు[2] "కాని విజయనగరము రామాయణకాలమునఁ గిష్కింధయను స్థలమునఁ గట్టఁబడినదను నిరాధార విషయమును నిస్సందేహముగాఁ జెప్పుట సాహసమని తోఁచుచున్నది." అని శ్రీ లక్ష్మణరావు గారు మహమ్మదీయ మహాయుగము, పుట 299లో, విజయనగరము కిష్కింధయను స్థలమునఁ గట్టఁబడెనని వ్రాసిన విషయమును గూర్చిన ఖండనము చేసిరి.

విద్యానగరము తుంగభద్రానదికి దక్షిణతీరమునఁ గట్టఁబడెనని వ్రాసియుంటిమికదా! ఇక్కడనే తుంగభద్ర రామాయణములో నభివర్ణింపఁబడిన అంజనపర్వతము, మాల్యవంతము, మతంగపర్వతము, ఋశ్యమూకము అను పర్వతముల నంటుకొని ప్రవహించుచున్నది. రామాయణములో వర్ణింపఁబడిన పంపానదియే తుంగభద్ర యను నది. ఈప్రదేశమును ప్రస్తుతము హంపీవిరూపాక్ష మని

---

1. Rice—Mysore Gazetteer, Vol. I, Page 277; Bombay Gazetteer, Vol. I, Part II, Page 142.
2. వసుచరిత్రవిమర్శనము, పుట III, 8-వ భాగము.

యెదరు. (పంపకే కన్నడములో హంపయను నామము కల్గినది. విరూపాక్షదేవాలయ ముండుటచేత హంపీ విరూపాక్షమని పేరువచ్చినది). ఈ విరూపాక్షదేవాలయమున కెదురుగా మాతంగపర్వత మున్నది. దానికి తూర్పుభాగమున మాల్యవంతపర్వత మున్నది. ఋశ్యమూక మనునది నైజామురాష్ట్రములోఁ దుంగభద్ర కుత్తరమున నున్నది. రామాయణములో వర్ణింపఁబడిన పంపాసరస్సుకూడ ఆనెగొందికి సమీపమునఁ నేఁటికిని ఉన్నది.

రామాయణము—కిష్కింధాకాండము

రావణుఁడు భిక్షుకవేషధారియైవచ్చి సీతాదేవిని గొంపోయినతరువాత సీతాన్వేషణార్థము రామలక్ష్మణులు దక్షిణాపథమునకువచ్చునపుడు పంపాసరోవరమును సందర్శించిరి. ఇచ్చట పంపాసరోవర సౌందర్యమును, నానావిధతరులతాపుష్పశోభితం బగు పరిసరారణ్యమును జూచి రాముఁడు విరహానలపీడితుఁడై కాంతావియోగమునకు విలపించెను. అంత సోదరుఁడగు లక్ష్మణుఁడు రాము నాశ్వాసింప మఱల వారిద్దఱు ఋశ్యమూకసమీపంబునకు వచ్చిరి.[1] వీరు ఋశ్యమూకమును సమీపిం

1. రామాయణము, కిష్కింధాకాండము—సర్గ ౧.

చుటఁ జూచి, సుగ్రీవాదులు హనుమంతుని రామలక్ష్మ ణుల యథార్థస్థితిఁ దెలియుటకై పంపిరి. ఇచ్చట సుగ్రీవుఁడు వాలిచేఁ బాఱఁదోలంబడి తనయనుచరులతో నుం డెను. హనుమంతుఁడు భిక్షుకవేషధారియై, రామలక్ష్మ ణుల నిజవృత్తాంత మెఱింగి, వారిని దోడ్కొని సుగ్రీవునొద్దకు వచ్చెను. అంతట రామసుగ్రీవులు అగ్నిసాక్షికముగా సఖ్యముచేసికొని యొకరి కొకరు సహాయముచేయుటకు నిశ్చయించుకొనిరి. తరువాత సుగ్రీవుఁడు తనకు వాలికిఁ గలిగిన వైరప్రకార మెఱిం గించి మాతంగపర్వతమునందలి మాతంగఋషి వాలి కిచ్చిన శాపముఁ జెప్పెను.[1] తరువాత సప్తసాలభంజనాది విశేషములును, వాలిసంహరణమును జరిగెను. వాలి సంహరణానంతరము రాముఁడు లక్ష్మణసమేతుఁడై ప్రస్ర వణమునందు వర్షాకాలము గడపెను: ప్రస్రవణ మను నది మాల్యవంతపర్వతమందలి యొకభాగము.[2] ప్రస్తు తము హాంపికి సమీపముననున్న నింబాపురము దగ్గఱ నున్న పెద్దగుట్ట యొక్కటి కలదు. దాని నిక్కడి వారు వాలికాష్ఠమని చెప్పుదురు. తరువాత సీతాన్వేష

1. రామాయణము, కిష్కింధాకాండము—సర్గలు-6—11.

2. రామాయణము, కిష్కింధాకాండము—సర్గ 28.

ణార్థము సుగ్రీవుఁడు వానరులను బంపుటయు, సీతంజూచి రాఁగలవాఁడు హనుమంతుఁడే యనినిశ్చయించి సుగ్రీవుఁ డాతనిపై సీతాన్వేషణకార్యభార ముంచుటయు, రాముఁడు స్వనామాంకితమైన యంగుళీయకమును గుఱు తునకై హనుమంతుని కిచ్చి నీవే కార్యభారము వహింప వలయునని చెప్పుటయుఁ గాఁగలకథ యీప్రస్రవణ పర్వ తమునందే జరిగెను.[1] అటుపిమ్మట హనుమంతుఁడు సముద్రమును లంఘించి, సీతనుఁ గనుఁగొని యావృత్తాం తమును రాముని కెఱింగించి యతని సంతోషస్వాంతునిఁ జేసినది రాముఁ డీపర్వతమందున్న సమయముననే. ఇప్పు డచట మాల్యవంతరఘునాథస్వామి దేవాలయము కలదు. దానివర్ణన విద్యానగర శిథిలములను గూర్చి వ్రాయునపుడు చదువరులు చదువఁగలరు.

కావున రామాయణమునఁ గిష్కింధాకాండ మునందు వర్ణింపఁబడిన ప్రదేశములు విద్యానగరము నిర్మింపఁబడిన స్థలమునందే యుండుటచేత, విద్యానగ రము కిష్కింధ యను స్థలముననే కట్టఁబడెనని విశ్వసిం చుటకు సందేహము లేదుకదా! ఈ ప్రదేశమునకుఁ బూర్వపశ్చిమప్రాంతములందుఁగృష్ణశిలాపంక్తులును,దక్షిణ

1. రామాయణము, కిష్కింధాకాండము—సర్గలు 40-44.

మంచు రామదుర్గ మను గుట్టలును, ఉత్తరమున ఋశ్య మూకాదు లగు కొన్ని నిమ్నోన్నతపర్వతమాలికలును తుంగభద్రాస్రవంతియు నుండుటవలన నీ పట్టణము నైసర్గిక పర్వతదుర్గముగా నున్నది. ఇట్టి యభేద్యస్థలమున నగరనిర్మాణము హరిహర విద్యారణ్యాదుల దూరదృష్టిని, నిరుపమబుద్ధివైభవమును వేనోళ్లఁ జాటి చెప్పుచున్నది.

మాధవ విద్యారణ్యుల చరిత్ర

ఏ మహామహుని ప్రేరణముచేతను, ఆశీర్వచన బలముచేతను విజయనగరము నిర్మింపఁబడి సకలైశ్వర్య విద్యాప్రాభవంబులచేఁ దులతూఁగి పూర్వఖండవాసుల చేతను, పశ్చిమఖండవాసులచేతను వేనోళ్లఁ బ్రశంసింపఁ బడెనో, యాయప్రతిమప్రతిభాఢ్యునిచారిత్రమునుగూడ చదువరులకుఁ దెలుపకున్న యీ చరిత్రకారునియందు దోషారోపణముఁ జేయ నవకాశము కల్గునుకదా!

మాధవాచార్యులవారు భారద్వాజ గోత్రుఁడు. బోధాయనసూత్రుఁడు. యజుశ్శాఖీయుఁడు. తండ్రి పేరు మాయనుఁడు. తల్లి శ్రీమతి. ఈయనకు సాయనుఁడు, భోగనాథుఁడు అను సోదరశిఖామణులు గలరు. పై విషయములు మాధవాచార్యకృత, సాయనవిరచిత గ్రంథములనుండి తెలియనగును.

"శ్రీమతి ర్జననీ యస్య సుకీర్తి ర్మాయణః పితా;
సాయనో భోగనాథశ్చ మనోబుద్ధిసహోదరౌ.

యస్య బౌధాయనం సూత్రంశాఖాయస్యచయాజుషీ;
భారద్వాజకులం యస్య సర్వజ్ఞః సహి మాధవః"

పరాశరమాధవీయము.

'మహేంద్ర వన్మాననీయో మంత్రీ; మాయణసాయణః,
మండలేషు కృతచారమండలః సాయనో జయతి
మాయణాత్మజః
మంత్రిమాయణసాయణ స్త్రిజగతి మాన్యాపదానో
దయః

'ఇతి శ్రీమత్పూర్వపశ్చిమదక్షిణోత్తరసముద్రాధిపతి
బుక్కరాజప్రథమదేశిక మాధవాచార్యానుజన్మ
నః, శ్రీమత్సంగమరాజసకలరాజ్యధురంధస్యర
సకలవిద్యానిధానభూతస్య భోగనాథాగ్రజన్మనః,
శ్రీమత్సాయనాచార్యస్య కృతావలంకారసుధా
నిధౌ."

సాయనుని అలంకారసుధానిధి.

'భారద్వాజాన్వయభువా తేన సాయణమంత్రిణా;
వ్యరచ్యత విశిష్టార్థ్యః సుభాషితసుధానిధిః

ఇతి పూర్వపశ్చిమసముద్రాధీశ్వరారిరాయవిభాల శ్రీ
కంపరాజమహాప్రధాన భరద్వాజవంశముక్తిక
మాయణార్యసుధాకర మాధవకల్పతరుసహో
దరసాయణార్యవిరచితే సుభాషితసుధానిధౌ

సాయణకృత సుభాషితసుధానిధి.

'తస్య (సంగమస్య) మంత్రిశిరోరత్న మస్తి మాయణ
సాయణః;

తేన మాయణపుత్రేణ సాయణేన మనీషిణా,
గ్రంథః కర్మవిపాకాఖ్యః క్రియతే కరుణావతా.

ఇతి మాధవభోగనాథసహోదరస్య మాయణనంద
నస్య సాయణాచార్యస్య కృతౌ ప్రాయశ్చిత్తసుధా
నిధౌ

సాయనవిరచిత ప్రాయశ్చిత్తసుధానిధి.

'తస్యా (సంగమస్యా)భూ దన్వయగురుస్తత్త్వసిద్ధాంత
[దర్శకః,

సర్వజ్ఞః సాయణాచార్యో మాయణార్యతనూద్భవః.
ఉపేంద్రస్యేవ యస్యాసీ దింద్రః సుమనసాం ప్రియః,
మహాక్రతూనా మాహర్తా మాధవార్యః సహోదరః.

సాయనకృత యజ్ఞతంత్రసుధానిధి.

'అస్తి శ్రీసంగమక్ష్మాపః పృథ్వీతలపురందరః;
తస్య మంత్రిశిరోరత్న మస్తి మాయణసాయణః.
తేన మాయణపుత్రేణ సాయణేన మనీషిణా
ఆఖ్యయా మాధవీయేయం ధాతువృత్తి ర్విరచ్యతే.

సాయనవిరచిత మాధవీయధాతువృత్తి.

పైని వివరింపఁబడిన విషయములు కంజీవరములో నున్న అరుళాళపెరుమాళ్ల దేవాలయములోఁగల యొక శాసనమువల్లఁగూడఁ దెలియవచ్చుచున్నవి. ఈ శాసన మసంపూర్తిగ నున్నది. ఈ శాసనమునందు శ్రీకంఠనాథుఁడు సాయనునిగురువుగాఁ జెప్పఁబడెను.[1] మాధవాచార్యులవారి మేనల్లుఁడు లక్ష్మీధరుఁడు మొదటిదేవరాయనిమంత్రిగా నుండెను.[2] ఆ విషయము ముందు దేవరాయనిచరిత్రమునఁ జదువఁగలరు.

మాధవాచార్యులకు విద్యాతీర్థులు, భారతీతీర్థులు, శ్రీకంఠుఁడు అను ముగ్గురు గురువులు కలరు. మాధవాచార్యకృత పరాశరస్మృతి వ్యాఖ్యానమునందు విద్యాతీర్థులు తనగురువని మాధవాచార్యుఁడే చెప్పికొనెను.

1 Epigraph'a Indica, Vol. III, P. 118.

2 Annual Report of the Archaeological Sarvey of India, for 1907-1908, Page 245.



౫౯. కృష్ణదేవాలయములోని మహామంటపముయొక్క తూర్పుముఖద్వారమునందు గంగాదేవి శిల్పచిత్రము




౬. ఉగ్రనరసింహావిగ్రహమునకు చెంతనున్న మహాశివలింగము

'సోఽహం ప్రాప్య వివేకతీర్థపదవీ మామ్నాయ యతీం
[ద్రేపరం,
మజ్జన్ సజ్జానతీర్థసంగిని పునః సద్భక్తితీర్థే పరం
లబ్ధా మాకలయన్ ప్రభావలహరీం శ్రీభారతీతీర్థతో
విద్యాతీర్థ ముపాశ్రయన్ హృది భజే శ్రీకంఠ
[మవ్యాహతం.(?)

పైని వివరింపఁబడిన ముగ్గురలో విద్యాతీర్థుఁడే తన ముఖ్యగురువని మాధవాచార్యుఁడు తనచే విరచింపఁబడిన అనుభూతప్రకాశికలో నిట్లు వాక్రుచ్చియున్నాఁడు:

"అంతః ప్రవిష్టః శాస్తేతి యో తయార్మిశ్రీరితః.
సోఽస్మాన్ముఖ్యగురుఃపాతు విద్యాతీర్థ మహేశ్వరః."

'విద్యాతీర్థ మహేశ్వరః' అని చెప్పియుండుటచే మాధవాచార్యులవారు తమగురువులు ఆదిశంకరుని యవతారముగా భావించినట్లు స్పష్టమగుచున్నది. ఈ విద్యాతీర్థులవిగ్రహమే విద్యాశంకరు లనుపేరిట శృంగే మాధవాచార్యులవారిచే ప్రతిష్ఠింపఁబడినది. ✓ రాధనమునకై[1] దానము లొసంగఁబడినట్లు నములు గలవు.

1. (a) Epigraphia Carnatica,
(b) Do Vol

ఈ విద్యాతీర్థులే మొదటి బుక్కరాయలకు (హరిహర రాయల సోదరుఁడు) మంత్రియు, మతగురువు నై యుండెను. బుక్కరాయల యేడటూరు [1] శాసనము నందు విద్యాతీర్థుల కరుణాకటాక్షముచే రాజ్యమును సంరక్షించుకొనెనని వ్రాయఁబడినది.

'క్షోణీసాగరమేఖలాం సకలయన్ భ్రూక్షేపమాత్రే స్థితాం
విద్యాతీర్థమునేః కృపాంబుధిశశీ భోగావతారోఽభవత్.

రెండవగురువైన భారతీతీర్థులను మాధవాచార్యులు తనచే రచింపఁబడిన 'జైమినీయన్యాయమాలా విస్తారము' అను గ్రంథమునం దిట్లు పేర్కొనెను:

'సభావ్యాద్భారతీతీర్థయతీంద్రచతురాననాత్;
కృపా మవ్యాహతాం లబ్ధ్వాపదార్థప్రతిమోఽభవత్.]

ఈభారతీతీర్థుల దృగ్దృశ్య వివేకమను గ్రంథమును, ...దశీప్రకరణమను గ్రంథమున నొకభాగమును, రచిం...యనకే హరిహర బుక్కరాయాదులు సోదరు... శ. 1346 సంవత్సరమున శృంగేరిలో ...యించి యిచ్చిరి.[2]

---

...atica, Vol. IV, Yedature, 46.
...tica, Vol. VI, Sringeri 1.

మాధవాచార్యులవారి మూఁడవగురుఁ డైన శ్రీ కరుఁడు కంజీవరశాసనములోని శ్రీకంఠనాథుఁడే. ఈ శ్రీకంఠుఁడు మాధవాచార్యులవారికిని, సాయనునకును, గురువులగుటయే కాక రెండవసంగమునకును మాధవాచార్యులవారి సోదరుఁడైన భోగనాథునకుఁగూడ గురువైనట్లు సంగముని బిట్రగుంట శాసనమువల్లను భోగనాథకృత 'మహాగణపతి స్తవము' వల్లనుదెలియుచున్నది.[1]

'మందారశ్చ తరుః పరేఽపి తరవో మేరుశ్చ శైలః [పరేఽ
ప్యాః శైలాః కమలాగృహస్థశయనం చాబ్ధిః పరేఽ [ప్యబ్ధయః;
శ్రీకంఠశ్చ గురుః పరేఽపి గురవో లోకత్రయే [ప్యద్భుతం
భక్తాధీన! భవాంశ్చ దైవత మహో సర్వేఽప్యమీ [దైవతాః.

మహాగణపతి స్తవము.

ఈ మాధవాచార్యులవారే సన్న్యాసాశ్రమము స్వీకరించిన తరువాత విద్యారణ్యులైరి కాని పండితులు కొందఱు మాధవాచార్యులవారు వేఱు, విద్యారణ్యులు

* Epigraphia Indica, Vol. I I, P. 23.

వేఱని యభిప్రాయము పడుచున్నారు. కాని మాధవా
చార్యులును, విద్యారణ్యులు నొక్కరే యని యీ క్రింది
యాధారములవల్ల నూహించుకొనవచ్చును. *

(1) నృసింహసూరి తనతిథిప్రదీపికయందు 'కాల
నిర్ణయము' విద్యారణ్యులు మొదలగు పండితులచే నిది
వఱకే వ్రాయఁబడినదని వ్రాసియున్నాఁడు.

'అనంతాచార్యవర్యేణ మంత్రిణా మాచిగుళ్లనా,
విద్యారణ్యయంతీంద్రాద్యై నిర్ణీతః కాలనిర్ణయః.
అనిశ్చైషీకృత స్తైశ్చ మమదిష్ట్యాకియార్జ కియాక్త,
తమహం సుస్ఫుటం వక్ష్యే ధ్యాత్వా గురుపదాంబు
[జమ్.

కాలనిర్ణయము మాధవాచార్యకృత గ్రంథము
లలో నొక్కటి యని తెలియవచ్చుచున్నది.

కాన మాధవాచార్యులును విద్యారణ్యులొక్కటి
యే యని యెఱుంగనగును.

(2) అహోబలపండితుఁడు మాధవాచార్యవిరచిత
ధాతువృత్తిని విద్యారణ్యకృత మని వ్రాయుచున్నాఁడు.
దీనినిబట్టి మాధవాచార్యులు, విద్యారణ్యులు నొక్కరే
యని గ్రహింపనగును.

---

* Indian Artiquary, February, 1916, Page 18-21.

"వేదానాం భాష్యకర్తా వివృతమునివచో ధాతువృత్తే
[ర్విధాతా;
ప్రోద్యా ద్విద్యా నగర్యాం హరిహర నృపతే స్సార్వ
భౌమత్వదాయీ;
వాణీ నీలాహివేణీ సరసిజనిలయా కింకరీతి ప్రసిద్ధా,
విద్యారణ్యోఽగ్రగణ్యోఽభవ దఖిలగురుః శంకరో
[వీతశంకః.

(3) పంచదశీప్రకరణ మను గ్రంథము మాధవా చార్యులచేతను, భారతీతీర్థులచేతను వ్రాయఁబడినది యని తెలియుచున్నది. పంచదశీప్రకరణమునకు వ్యాఖ్యానము చేసిన రామకృష్ణుఁడు భారతీతీర్థులకును విద్యారణ్యులకు నిట్లు వ్యాఖ్యానమునకు మొదటను, తుదనుగూడ నమస్కృతు లొనర్చెను.

"నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ;
మయాద్వైతవివేకస్య క్రియతే పదయోజనా.

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ భారతీతీర్థ విద్యారణ్యమునివర్య కింకరేణ శ్రీ రామకృష్ణ విదుషా విరచితా పదదీపికా."

ఇందు భారతీతీర్థులు మాధవాచార్యులకు గురువని యిదివఱకే తెలిసికొన్నాము. గ్రంథము మాధవా

చార్యులవారును, భారతీతీర్థులు గలసి వ్రాసిరని తెలియు చున్నది. వ్యాఖ్యానకారుఁడు భారతీతీర్థులను, విద్యా రణ్యులను గలసి వ్యాఖ్యానమున కాదిని, గద్యయందు నుదాహరించుటఁజేసి మాధవాచార్యులు విద్యారణ్యు లొక్కరేయని తెలిసికొనవచ్చును.

(4) క్రీ. శ. 1386 సంవత్సరమున రెండవ హరి హరరాయలచే నీయఁబడిన దాన శాసనమునందు, హరి హరుఁడు వైదికమార్గ ప్రతిష్ఠాపకుఁడనియు, ధర్మబ్రహ్మా ధ్వన్యుఁడనియు, నతఁడు విద్యారణ్య శ్రీపాదుల సన్ని ధిని చతుర్వేదభాష్య ప్రవర్తకులగు నారాయణ వాజ పేయయాజికిని, నరహరిసోమయాజికిని, పాండరిదీక్షితు లకును దానశాసనము వ్రాయించియిచ్చెనని వ్రాయఁబడి యున్నది. *

మాధవాచార్యులవారు వేదభాష్యకర్త యని తెలియుచున్నది. పైని వివరింపఁబడిన పండితత్రయము వేదభాష్యరచనయందు మాధవాచార్యులకుఁ దోడ్పడి యుండవచ్చును. కావున మాధవాచార్యులవారి కోర్కె పై, హరిహరుఁ డాయనసన్నిధిని వారల కా దానశాస నము తప్పక వ్రాయించియుండును. విద్యారణ్యులు వేఱు

* Mysore Archaeological Report for 1908, p. 54.

పురుషుఁడైనయెడల నతనిసన్నిధానముననే దానశాసనము వ్రాయించియిచ్చుట పొసఁగనేరదు.

పై నుదాహరింపఁబడిన నాల్గుకారణములఁ బట్టి మాధవాచార్యులు విద్యారణ్యులు నొక్కరే యని చెప్ప వచ్చునుగదా! పై శాసనకాలమునాఁటికి అనఁగా; క్రీ. శ. 1386 సంవత్సరమునకుఁ బూర్వమే మాధవాచార్యులవారు సన్న్యాసాశ్రమము స్వీకరించి విద్యారణ్యు లనునామమునఁ బరగుచున్నట్లు విదితముకదా! మఱికొన్ని యాధారములవల్ల నితఁ డింతకుఁబూర్వమే సన్న్యాసియైనట్లు తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 1378 సంవత్సరమునాఁటి యొకశాసనములో విద్యారణ్యుఁ డా సంవత్సరముననే సన్న్యసించిన ట్లున్నది. ‡

క్రీ. శ. 1377 సంవత్సరమునాఁటిశాసనములలో నొకదానియందుఁగూడ విద్యారణ్యునినామము కాన్పించుచున్నందున, మాధవాచార్యులవారు క్రీ. శ. 1377, లేక 1378 సంవత్సరప్రాంతములవఱకు హరిహరబుక్కరాయాదులకడ మంత్రిగ నుండి, తరువాత సన్న్యసించి యుండవచ్చును.

---

‡ Epigraphia Carnatica, Vol. VI, Koppa 30.

మాధవాచార్యులవారి పాండిత్యము

మాధవాచార్యులవారు సకలవిద్యాపారంగతుఁడు. తర్కవ్యాకరణవేదాంతాదిశాస్త్రపరిజ్ఞానఘనుఁడు. సత్కవిశ్రేష్ఠుఁడు. ప్రథమ హరిహరబుక్కరాయలకు మంత్రిగను, హితబోధకుఁడుగను నుండియు, వేదాంత శాస్త్రరహస్యస్థితులఁ గుర్తెఱింగి, వేదభాష్యాద్యగ్రంథములను రచించిన విద్యాసాగరుఁడు. మాధవాచార్యుల వారును, సోదరుఁడైన సాయణాచార్యుఁడును గలిసి రచించిన గ్రంథములు నూటికిఁబైగా నుండునని పెద్దలు చెప్పుదురు. వీరు రచించిన భాష్యమునకే సాయణభాష్య మని పేరు. మాధవుఁడు సన్న్యాసమును స్వీకరింపక మున్న 'పరాశరస్మృతివ్యాఖ్యానము, మనుస్మృతివ్యాఖ్యానము, వేదభాష్యములు, జైమినీన్యాయమాలావిస్తారము, కాలమాధవ్యము, వ్యవహారమాధవ్యము, శంకర విజయము, సర్వదర్శనసంగ్రహము మొదలగు గ్రంథములను రచించెను. సన్న్యాసమును స్వీకరించిన పిదప వేదాంతపంచదశి, వివరణప్రమేయసంగ్రహము, బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి, జీవన్ముక్తివివేకము, దేవ్యపరాధ స్తోత్రము మొదలగు గ్రంథములను రచించెను. నూటికి మించియున్నయట్టి గ్రంథరాజములలో, ధర్మశాస్త్ర

విషయమునఁ బరాశరమాధవీయమును, వేదాంతవిషయమునఁ బంచదశియు, చరిత్రవిషయమున శంకరదిగ్విజయమును, దర్శనవిషయమున సర్వదర్శనసంగ్రహమును, జైమినీన్యాయమాలయనుగ్రంథమును, మన దేశములో నేటికిని విద్వన్మాన్యములై విఖ్యాతములై యున్నవి.

మాధవాచార్యులు వైదికమతోద్ధారకుఁడు

మాధవాచార్యులవారు, మంత్రిశిఖామణియుఁ, బండితసింహుఁడు, కవికులశ్రేష్ఠుఁడు నగుటయేకాక మతోద్ధారకుఁడుఁగూడ నైయుండెను. మహమ్మదీయమత విజృంభణమువల్లను, జైనజంగమమత ప్రాబల్యమువల్లను, దేశ మరాజకమై, వైదికమతము క్షీణదశకు రాఁ జొచ్చెను. అట్టిసమయమున విద్యారణ్యులవారు వైదికమతోద్ధారణమునకై కంకణముఁ గట్టుకొని, స్వమతరక్షణార్థము పెక్కుగ్రంథముల రచించి, దేశమున మఱల శ్రౌతస్మార్త కర్మములు వృద్ధినొందుటకు సకలవిధములఁ బాటుపడిరి. అట్టిమహత్కార్యమును గొనసాగించుటకును, దినదినాభివృద్ధినొందుటకును, స్వదేశ స్వమతోద్ధారణములు తన దేహాత్మలగాఁ బరిగణించి యొకనూతన హిందూసామ్రాజ్యమును నెలకొల్పి, విద్యారణ్యులవారు దానిని వర్ధిల్లఁజేసిన దేశభక్తాగ్రగణ్యులు.

విద్యారణ్యులవారు సుమారు ఎనుబదియైదేండ్లు జీవించిరని, విద్యారణ్యాకృత దేవ్యపరాధస్తోత్ర మను గ్రంథములోని యీ క్రిందిశ్లోకమువల్లఁ దేటపడంగలదు.

'పరిత్యక్తా దేవా వివిధపరిసేవాకులతయా,
మయా పంచాశీతే రధిక ముపనీతేతు వయసి;
ఇదానీం చే న్మాత! స్తవ యది కృపా నాపి భవితా
నిరాలంబో లంబోదరజనని! కే యామి శరణమ్. †

విద్యారణ్యులవారు ఎన్బుబదియైదేండ్లు జీవించితి నని ఆయనయే చెప్పుకొనియుండుటచేతను, క్రీ. శ. 1387 సంవత్సరప్రాంతమున వీరు బ్రహ్మైక్యముఁ గాంచి రని తెలియుచుండుటచేతను వీరిజీవితకాలము క్రీ. శ. 1302 మొదలు క్రీ. శ. 1387 వఱకు నుండెనని నిస్సంశ యముగాఁ జెప్పనగును.‡

కుమారధూర్జటికవికృత కృష్ణరాయవిజయమునం దు, విద్యానగరనిర్మాణప్రశంసయు, విద్యారణ్యులప్రశం సయుఁ గలదు. స్థలమాహాత్మ్యమునుగుఱించి కవి వర్ణిం చుచు, విద్యానగరమున్నస్థలమే పూర్వము కిష్కింధ యని వ్రాయుచున్నాఁడు.

---

† Sources of Vizayanagara History, Page 50
‡Sources of Vizayanagara History Introduction. P.3

క. వెలయఁగ విద్యారణ్యులు
చెలువలరం గని పురంబు సేయకమునుపే
కొలఁదిఁ దనరాగ నీస్థల
మిలలో నిచ్చటి మహత్త్వ మెందునఁ గలదే!

శా. విద్యారణ్యు లనంగ నెవ్వ రతఁడే
విద్యం బ్రకాశించె నీ
హృద్యంబైనపురం బొనర్చు విభవం
బేలాగునంగాంచెనో
చోద్యంబయ్యెడి మీరు విన్నకథ
యిచ్చో లెస్సగాఁ దెల్పుఁడీ
యాద్యంతంబు నటన్నఁ దత్సభికు
లాహ్లాదంబుతో నుడఁగన్.

మ. రమణీయాబ్రతరంగిణీఘుమఘుమా
రావార్థగంభీరవా
క్కృత్రిమజంఝానిలధూతదుష్కృవిమహా
గర్వాభ్రసంఘుండు ది
గ్రమణీమౌక్తికహారబంధురయశో
రాజద్గుణాఢ్యుండు డిం
డిమపుంభావసరస్వతీంద్రుఁ డనియెన్
ఠీవిం బ్రకాశించుచున్.

క. స్వామీ! విద్యారణ్య
స్వాములచరితంబుఁ దెలుపవలె నంటిరిగా
యీమానవులకు నమ్ముని
సామర్థ్యం బెఱుఁగవశమె జగతీరమణా!

మ. నరు లజ్ఞానవిమోహితాత్ము లగుటన్
రక్షింపఁగా నెంచి శం
కరుఁడే శంకరుఁడై విభేదమతముల్
ఖండించి వేదాంతశా
స్త్రరహస్యస్థితిఁ దెల్పఁగా నతఁడె
విద్యారణ్యమూర్తిన్ జగ
ద్గురుఁడైఁ తోఁచెఁ దదీయవైభవము
లెందు న్మెచ్చఁగా శక్యమే.

తే. సకలవిద్యాప్రవీణుఁడై జనవరేణ్య
యమ్మహామాని శ్రీలక్ష్మి ననుసరించ
మహితచింతామణీమంత్రమర్మమెఱిఁగి
సాత్త్వికోన్నతిఁ బెక్కేండ్లు జపముఁ జేసె.

వ. అమ్మునీంద్రచంద్రుండు వెండియు నఖండవిద్యాసుధా
సాగరంబునఁ బొడమిన రత్నంబులకై వడిఁ దనరు తన
కు నమ్మహాదేవి తోడుగావలయునని తదీయసాక్షా

త్కారం బపేక్షించు తీవ్రతకుం గరుణించి యొక్క-
నాఁడు.

..................................................

..................................................

తే. వరమునీశ్వర ! వేఁడుము వర మటన్నఁ
గరము మోద్చుచు సంతోషకరము గాఁగఁ
బరమసద్భక్తి వెలయఁ దత్పరమతీవ్ర
భాసమానస్థితుల్ మించఁ బ్రస్తుతించి.

తే. అమ్మహాదేవితోడ నిట్లనియె నతఁడు
వేడ్క-మీఱంగ నాపేర వెలయునట్టి
పురము గావింపవలయుఁ దత్పరమునందుఁ
జెలఁగి సంతతమును నీవు నిలువఁదగును.

చ. అన విని యిందిరారమణి
యమ్మునిచంద్రునితోడఁ బల్కె- నో
వినుతగుణాఢ్య ! నీదు వెను
వెంటనె వచ్చెదఁ బొమ్ము ముంగ-
ఘనతరలీలలం బురముఁ
గట్టుటకుం దగుచోటు
గనుఁగొనఁ బోకు మియో
క్రమ్మరి

వ. అనిన నమ్మహానుభావుం డట్లనె తనయున్న చక్కటికిం జక్కనిదక్షిణంబుగాఁ గతిపయ ప్రయాణంబులు చనిచని ముందట.

శా. రంగత్తుంగతరంగఘుంఘుమరవద్రాఘిష్ఠశైలాంతరా
భంగగ్రావపరస్పరోత్కషణబిభ్యద్గ్రాహపాఠీనసా
రంగానీకకుళీరహంసబకచక్రక్రౌంచవన్యోత్థమా
తంగధ్వన్యధరీకృతాఖిలసముద్రన్ దుంగభద్రానదిన్.

క. కనుఁగొని యమ్మునిచంద్రుం
డనువొందఁ గృతావగాహుఁడై తత్తటినీ
ఘనతరతటస్థితుండై
తనరు విరూపాక్షశివుని దర్శించె వెసన్.

వ. తదీయస్థలప్రభావంబుఁ దెలియంగోరినం బురాణజ్ఞులగు పారు లిట్లనిరి.

. మునుపు సుగ్రీవుఁడును వాలియును గడంగి
ఁడనముఁ జేసి రిచ్చట ప్రబలుఁడైన
మతంగపర్వతము నెక్కె
శట వాలి కరుగరామి.

జ్ఞ వలన
మునకుఁ

జనఁగ భయమంది సుగ్రీవుఁ జాపెఁ జోక
క్రమ్మఱను వాలి యిదిపూర్వకథ మహాత్మ!

సీ. ఇది నిజోన్నతశృంగహేవాకజితమేరు
కుధరమై తగు హేమకూటశైల
మది పతంగతురంగహరితప్రభాసంగి
మరకతశిఖరమౌ మాల్యవంత
మిది వశ్యమునిదృశ్యహితలతాంచితమహా
భూమిజయుతఋశ్యమూకశిఖరి
యది మతంగజబృంహితారవప్రతిరవ
ప్రదకంధరమతంగపర్వతంబు

తే. మునిజనోత్తమ కిష్కింధ యనఁగఁ దనరు
నిమ్మహాపుణ్యభూమి నీ విందునిల్వ
నర్హ మనుటయు విని యమ్మహానుభావుఁ
డాత్మ నద్భుత మొంద నయ్యవసరమున.

తే. తత్ప్రదేశంబునందు నెంతయును వింత
మీఱఁగా నొకకుందేలు సారమేయ
మును మహోద్ధతిఁ దఱుముచుబ్బురముఁ జూచి
యౌర! యది యద్భుతంబని యాత్మ నెఱిఁగి.

క. వీరక్షేత్రం బగు నిది
గారవమున నగర మి[illegible]ఁ గావింప శుభ .

శ్రీరంజిల్లు నటంచుఁ
సారమతిఁ సన్ముహూర్తచతురత వెలయఁ.

సీ. కోటలోఁ దెఱగంటి పాటలాధరలెల్ల
నాటలాడఁ దలంచ హాసమింప
మేడలా మిన్నేటిజాడలానినయంచ
జోడు లాదటఁ గాంచుసాబ గెసంగ
శాలలా నవరత్నజాలలాలితకాంతి
లీలరాగినవింతమేలు చూడ
బాలలా మరునిబాబాలలాగునఁ బల్కు
హేలలోఁ గొనఁజాలు నితవుమీఱ

తే. నవ్వుర నిర్మించెఁ దనపేర నఖిలలోక
పాలకపురాధికప్రభాబంధురముగ
గరిమ దనరంగ విద్యానగర మనంగ
మెఱయు పురరత్నమాధరామరవరుండు.

కృష్ణరాయవిజయము, ద్వితీయాశ్వాసము. ప. 14–34.

కుమారధూర్జటి వ్రాసినగాథకును చారిత్రక విషయములకును గలభేదము చదువరులు గ్రహించియే యుందురు. విద్యానగరము విద్యారణ్యకృత మనియు, నచ్చటనె పూర్వము కిష్కింధయుండెననియు మాత్రము నాతఁ డొనర్చినవర్ణన ననుస... మన మెఱుంగనగును.



౭. హేమకూటపర్వతమునుండి కనబడు శశివకల్లు
గణేశదేవాలయము, కృష్ణస్వామిదేవాలయము



౮. కడలెకల్లు పెద్దవిఘ్నేశ్వరునిగుడియొక్క పడమటివైపు

48B

౨

సంగమవంశము తెలుగువంశమా? కర్ణాటవంశమా?

సంగమరాజపుత్త్రులైన హరిహర బుక్కరాయా దులశాసనములలో, వారు చంద్రవంశజులనియు, చంద్రవం శమునజనించిన యదునిసంతతివారనియుఁ జెప్పఁబడినది. ఆకాలమునాఁటి ప్రసిద్ధ రాజవంశసంజాతు లందఱును తమవంశములఁ జంద్రునికో సూర్యునికో ముడివెట్టుచుండిరి. మనము చంద్రుని, బుధుని వదలి నిజమైనచారిత్రకపురుషు లకుల మెట్టిదియో నిర్ణయించుటకుఁ దగిన యాధారము లేమియుఁ గన్పట్టవు. దానికిఁ దగినట్టుగాఁ జరిత్రకారులు తమయూహాల విస్తరింపఁజేసి తమయిచ్ఛవచ్చినట్లు సత్యవృత్తాంతమును గనుఁగొనుటకు మార్గము మును జేయరు. విద్యానగరస్థాపనమునకుఁ బు హరిహర రాయ బుక్కరాయాదులు ఆనెగొంది పరిపాలనముచేయుచున్నట్లు చరిత్రకారులువ్రా శాసనములు బలపఱచుచున్నవి. ఆనెగొంది ములోనిది. ఆప్రాంతమునకే కుంతలదేశమని ముకూడఁ గలదు. కుంతలదేశమును కదంబుఁ

వారు పాలించిరి; కనుక వీరలుకూడ కదంబరాజవంశ ములోనివారే యని కొందఱు చరిత్రకారులు తలంచుచు న్నారు.[1] మఱికొందఱు చరిత్రకారులు హరిహరాదులు కురుబవంశములోనివారని చెప్పుచున్నారు. స్వ్యాయల్ పండి తుఁడువీరుకురుబవంశములోనివారనియుఁ గాకతీయ ప్రతాప రుద్రునికడఁ గోశాధ్యక్షులుగ నుండి ఓరంగల్లు లేక ఏక శిలానగరము మహమ్మదీయుల హస్తగతమైనపుడు, అచ్చటనుండి పాఱిపోయి ఆనెగొంది సంస్థానాధీశ్వరులయొ ద్దఁ గొలువు సంపాదించికొనిరనియు వ్రాయుచున్నారు.[2] బుకానన్ పండితుఁడు వీరలు ప్రతాపరుద్రునికడ కోశాధ్య క్షులుగనున్నట్లు వ్రాసెనని యిదివఱకే తెల్పియున్నాఁడను. మహమ్మదీయచరిత్రకారుఁడైన ఫెరిస్తా వీరాంధ్రులనియు ...గానగరము పడిపోయినపిమ్మట వీరలు తుంగభద్రా

---

Forgotten Empire, Page 22-23.

Perbaps the most reasonable account would be ...ed from the general drift of the Hindu legends ...l with the certainties of historical fact; and from ... of view, we may, for the present, suppose that ...'s, Hindus of the Kuruba caste, who were ...ng religious feeling, serving in the treasury of ... Warrangal, fled from that place on its sack ...on in 1323 and took service under the petty ...undi—Forgotten Empire, Page 23.

నదీతీరమున నున్న విజయనగరమునకుఁ బోయి యచ్చట మహామ్మదీయుల విజృంభణమునకుఁ జాలకాల మడ్డుపడి నిల్చిన యొకసామ్రాజ్యమును నెలకొల్పిరని వ్రాయుచున్నారు.[1] మైసూరుచరిత్రమును వ్రాసిన విల్క్సుపండితుఁడు (Wilks) ఈ నూతనసామ్రాజ్యస్థాపనము తెలుఁగుభాష యొక్క ప్రాబల్యమును, ఆంధ్రులయొక్క ఔన్నత్యమును జాటుచున్నదనియు,గర్ణాటదేశమునకు వీరలు పరదేశీయులనియు, నచ్చట తెలుఁగుసైన్యముచే రక్షింపఁబడి యొక తెలుఁగుకొలువుకూట మేర్పడెననియు స్పష్టముగా వ్రాయుచున్నాఁడు.[2] పైవిషయముల నన్నిటిని సమన్వయించి

---

1. Warrangal has fallen and the eastern territories of the Andhras had been annexed but a branch of this family appears to have removed to Vizayanagar on the Tungabhadra and founded a kingdom there, which resisted the Mohommedans of the Deccan and rose to great power and eminence.

2. Wilks Vol. I, Page 9.

"The sgin of the new Government at once explains the ascendency of the Telinga (Telugu) Language and nation at this capitalofCarnatic and proves ·- state of anarchy and weakness which had succeeded ruin of former dynasty. The Government found foreigners was also supported by foreigners and !n e centre of Canara, a Telinga Court was supported y a Telinga army."

చూచినయెడల నీవిషయములు మనమూహించుకొనం దగియున్నవి. (1) హరిహరాదులు కర్ణాట దేశమునకుం గ్రొత్తవారు. (2) వారు స్వసామర్థ్యముచేత బాహుబలదర్పముచేత నూతనసామ్రాజ్యమును నెలకొల్పిరి. (3) మహమ్మదీయవిజృంభణము తరువాత దక్షిణదేశమునం దరాజకము సంభవించి, యాంధ్రదేశమునం దుండియుం దదితరప్రాంతములనుండియుం బ్రజలనేకులు ధనప్రాణమాననష్టముల కోర్వలేక హరిహరాదులపాలనమునం దలదాచుకొనుటకు వచ్చి వారియండ నుండి సుఖపడి వారల కత్యంతసాహాయ్యమొనర్చి స్థిరసామ్రాజ్యస్థాపనమునకుం గారకులైరి. (4) కాకతీయసామ్రాజ్య మాంధ్రసామ్రాజ్యము గనుక, మహమ్మదీయుల యొత్తిడి యెక్కువగా నాంధ్రనగరమునకును, ఆంధ్రసామ్రాజ్యమునకును దగులుటవలనం బెక్కం డ్రాంధ్రులు స్వజాతీయులైన హరిహరాదుల వెంటంబడి, మహమ్మదీయులయొత్తిడి యింకనెప్పుడు కలుగకుండ నట్లు ప్రత్యేకస్థలమున రాజ్యస్థాపనమునకుం గడంగియుందురు. (5) కావున హరిహరాదులు ఆంధ్రులైయుండవచ్చును.

విజయనగరసామ్రాజ్యమేలిన సాళువ, తుళువ, ఆర్వీటివంశములు తెలుఁగువంశములు. ఆమహారాజులు ఆంధ్రకావ్యకృతికర్తలై, కృతిభర్తలై వాసిగాంచిరి. మనయాంధ్రవాఙ్మయమునందలి పెక్కుగ్రంథములు వీరికాలముననే, వీరి ప్రోత్సాహముననే రచింపఁబడినవి. సంగమవంశీయులును తెలుఁగుకవిత్వమును బోషింపకున్నను, తెలుఁగుకవీశ్వరుల నాదరించినవారే. మొదటిబుక్కరాయలు హరివంశమును రచించిన సుప్రసిద్ధాంధ్రకవివర్యుఁడగు నాచనసోమునకు దానశాసనము వ్రాయించియిచ్చెను. సకలవిద్యాసనాథుఁడగు శ్రీనాథుఁడుప్రౌఢదేవరాయనికాలమున నాతని మౌక్తిక సభాగారాంతరమునఁ గనకాభిషేకముఁ గాంచెను. ప్రత్యేకముగఁ దెలుగుకవులఁ బోషింపక పోవుటకుఁ గారణ మాకాలమునందు రెడ్డిరాజుల పోషణమునఁ గవితాకన్య నూతన విలాసములతో వెలుంగుచుండుటయుఁ గవులు గోదావరీ, కృష్ణా, పినాకినీ తీరముల theదలి యింతదూరము రాకుండుటయునై యుండును.

the
by ఇఁకముందు సంగమవంశరాజులచరిత్ర సంగ్రహ
th
b ముగాఁ జెప్పెదను.

# సంగమవంశము

## ప్రథమహరిహరరాయలు (క్రీ.శ. 1336–1355)

ప్రథమహరిహరరాయలగుఱించి మనకు విస్తారముగా శాసనాధారము లేవియు లేవు. కాపలూరు శాసనమున నితఁడు క్రీ. శ. 1336 సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడైనట్లు మాత్రము తెలియుచున్నది.[1] కాపలూరు శాసనకాలము నాఁటికి హరిహరరాయలు పెనుగొండరాజ్యమును, చంద్రగిరిరాజ్యమును జయించి, ఆనెగొందిలోనుండి పరిపాలనము చేయుచుండెనని శాసనమునందే వ్రాయఁబడియున్నది. కాని యాకాలమునందే మూఁడవ బల్లాలదేవుఁడు హోయిసల రాజ్యమును బరిపాలించుచున్నట్లును. తనరాజధానిని ద్వారసముద్రము నుండి[2] తిరువన్నామలకు మార్చుకొనినట్లును గన్పట్టుచున్నందున హరిహరరాయల కింకను హోయిసలరాజ్యము స్వాధీనముకాలేదనియు, నతఁ డింకను దనరాజ్యమును హోయిసలరాజ్యములోనికి విస్తరింపఁ జేయలేదనియుఁ

---

1· Nellore Inscriptions, Vol. No. 15.

2· Annual Report on Epigraphy, 1906-1907, P. 51 and Mysore Gazetteer ,Vol. I, P. 342.

దోఁచుచున్నది. ఇతఁడే విద్యానగర నిర్మాణకర్తలలో నొక్కఁడని యిదివఱకే తెలిపియున్నాను. హరిహరరాయలు సంగముఁడనువాని జ్యేష్ఠకుమారుఁడు. సంగమునకైదుగురు కుమారులు. వీరలు హరియన్న, కంపన్న, బుక్కన్న, మారప్ప, ముద్దప్ప యనువారలు. వీరైదుగురును కలసిమెలసియుండిరనియు విజయనగరరాజ్యాభివృద్ధికిఁ బంచపాండవులవలెనైకమత్యము కల్గి వారిశక్తిసామర్థ్యములను ధారపోయుచున్నట్లు, వీరేవురును, అళియబల్లప్పదండనాయకుఁడును, కుమారశ్యామన్నయొడయరును గలసి, దిగ్విజయజ్ఞాపకార్థము శా.శ.1268(క్రీ.శ. 1346.) పార్థివసంవత్సర ఫాల్గుణ బహుళపాడ్యమినాఁడు శృంగేరీపీఠాధిపతులగు భారతీతీర్థశ్రీపాదులకును, వారి శిష్యులకును నలువండ్రు బ్రాహ్మణులకును దొమ్మిదిగ్రామములను దానముచేసినవిషయమే చెప్పకచెప్పుచున్నది.[1] హరిహరరాయలు క్రమక్రమముగా రాజ్యమును బశ్చిమతీరమువఱకును వ్యాపింపఁజేసినట్లు శాసనాధారములు కూడఁగలవు. హరిహరరాయని సామంతులలో నొక్కఁడగు చామేయనాయకుఁడు హరిహరుని యాజ్ఞప్రకారము బాదామకోటను కట్టించెను.[2] అదియుఁగాక పశ్చిమతీర

1·Epigraphia Carnatica, Vol III, Page 21 Introduction),
2· Indian Antiquary, Vol. X, Page 63.

మండలి బైరసు ఒడయర్లు హరిహరునికి సామంతులుగ నుండున ట్లంగీకరించినట్లుకూడఁ దెలియుచున్నది.[1] హరి హరుని మఱియొక శాసనమునందు 'పూర్వపశ్చిమసము ద్రాధీశ్వరుఁ డని(Lord of the Eastern and western oceans) హరిహర దేవరాయ లభివర్ణింపఁ బడెను.[2] దీనికి నిదర్శనముగా నితని పెదతమ్ముఁడైన కంపభూపతి యుదయ గిరి రాజ్యమును బరిపాలించుచున్నట్లు మఱియొక శాసనము వలనఁ దెలియుచున్నది.[3] హరిహరరాయని మఱియొక తమ్ముఁడైన మారప్ప అరహమలె రాజ్యమునుబరిపాలించు చుండెను. ఇతనికి రాజధాని చంద్రగుత్తి. ఇతనిమంత్రి మాధవుడు. మారప్ప క్రీ. శ. 1346 సంవత్సరములో గదంబ లేక వనవాసి రాజ్యమును జయించి చంద్రగుత్తిలో మాధవమంత్రి సహాయముతో రాజ్య మేలుచుండెనని యీ క్రిందిశాసనమువల్లఁ దెలియగలదు.[4] తెక్కలినాడు లేక ముళువాయిరాజ్యమును హరియప్ప తమ్ములలో నింకొకఁడగు ముద్దప్ప పరిపాలించుచున్నట్లు వేఱొక శాసనమువల్ల విశదము కాఁగలదు.[5] హరిహరరాయని

1. Epigraphia Carnatica Vol. IX, P. 39.
2. A. S. R. 1908-1909, Page 236
3. Epigraphia Indica, Vol. III. Page 114.
4. Nellore Inscriptions, Page 789. No. 28.
5. Epigraphia Carnatica, Vol. VIII. Sh. 375.

మూఁడవతమ్ముఁడైన బుక్కరాయలు ద్వార సముద్రము రాజధానిగా హోయిసలరాజ్యమును బరిపాలించుచున్నట్లు (క్రీ.శ.1352) వేఱొక శాసనమువల్ల విదితమగుచున్నది.[1] తరువాత రెండేండ్లకు అనఁగా, క్రీ.శ.1354 సంవత్సరములో బుక్కరాయలు తన రాజధానిని హోస్పట్టణమునకు మార్చుకొనెనని యింకొక శాసనమువల్లఁ దెలియుచున్నది.[2] పడమటితీరమున తుళు రాజ్యములో నుత్తరభాగమైన బరకూరుప్రాంతమును హరిహరుని సామంతులలో నొక్కఁడు పాలించుచున్నట్లును[3] దక్షిణభాగమైన మంగళూరు రాజ్యమును హరిహరుని మంత్రులలో నొక్కఁడగు హడపాద గౌతరాజనునాతఁడు క్రీ. శ. 1349 సంవత్సరమున నేలుచున్నట్లును నిదర్శనము లున్నవి.[4]

పైనివివరించినవిధమునఁ బ్రథమహరిహరరాయలు విజయనగరరాజ్యమును స్వతంత్రుఁడై రాజ్యమును ఖండములుగా విభజించి తనసోదరులను ముఖ్యభాగములైన యుదయగిరి, అరగమలె, ములువాయి, హోయిసలఖండములకు రాజప్రతినిధులుగ నియమించి, మిగిలి

1. Epigraphical Collection. 1906—No. 522.
2. Epigraphia Carnatica, Vol. XI. Cd. 283.
3. South Canara Manual, Vol. II. Page 264
4. Epigraphical Collection for 1901. No. 57

ములకుఁదగినరాజప్రతినిధుల నేర్పఱచి రాజ్యమునంతయు మిగులసామర్థ్యముతోఁ బరిపాలించుచుండినట్లు స్పష్టము కదా. అదియుఁగాక తనసోదరులకుఁ దనయం దెట్టియసూయఁ గలుగకుండునట్లును, వారలచే గౌరవము, సాహాయ్యము పొందుటకు వారల రాజప్రతినిధులుగా స్వతంత్రులఁజేసి వేర్వేఱుప్రాంతముల కధిపతులఁజేయుటచే హరిహరుని విశాలహృదయమును, దూరదృష్టియు, రాజనీతియుఁ బ్రస్ఫుటమగుచున్నవికదా. అదియుఁగాక నిట్టికట్టుదిట్టముల నొనర్చుటచే విజయనగరరాజ్యమునకుఁ గట్టిపునాది వైచుటకుఁ గారకుఁడయ్యెను. ఇతఁడు బరకూరు, మంగలూరు రాజ్యపాలకులకు స్వంతనాణెములను ముద్రించుకొనుట కధికార మొసంగెనని శాసనములందలి బరకూరుగద్యాణములు, మంగలూరు గద్యాణములని నాణెములకు వ్యవహారనామములు కల్గుటకుఁ గారణమని తెలియవచ్చుచున్నది. [1]

...హమనీ రాజ్యస్థాపనము

హరిహరరాయలు హిందూ సామ్రాజ్యమునకుఁ ...చినకాలముననే హసన్‌గంగూ అనువాఁడు ఢిల్లీ ...ని ధిక్కరించి స్వతంత్రుఁడై క్రీ. శ. 1347 సంవ

---

...pigraphia Indica, Vol· VIII, Page 130, Note 1.

త్సరమున బహమనీరాజ్యమును స్థాపించి దక్షిణహిందూ స్థానమున నొక మహమ్మదీయరాజ్యము నెలకొల్పెను. ఇతఁడు క్రీ. శ. 1358సంవత్సరములో మృతినొందుటచే హరిహరునకు సమకాలికుఁడు.[1]బహమనీరాజ్యము నెలకొల్పంబడిన దాది విజయనగర సామ్రాజ్యాధీశులకును, బహమనీ సుల్తానులకును కలహము లారంభమై యుద్ధములు జరుగుచువచ్చెను.

హరిహరరాయలు క్రీ. శ. 1343 సంవత్సరములోనే మృతినందినట్లు స్యూయల్ పండితుఁడు వ్రాసినది విశ్వసనీయము కాదు. హరిహరరాయని శాసనములు క్రీ. శ. 1354 సంవత్సరమువఱకుఁ గన్పట్టుచున్నందున[2] నితఁడు క్రీ. శ. 1354 సంవత్సరములోఁ గాని మఱుసటి సంవత్సరములోఁగాని కీర్తిశేషుఁడై యుండవచ్చును.

విద్యానగరనిర్మాణకర్తయు నూతన విజయనగర సామ్రాజ్యస్థాపకుఁడు నగు హరిహరరాయలు స్వర్గస్థుఁడైన పిదప నితనితమ్ముఁడు బుక్కరాయలు రాజ్యమునకు వచ్చెను.

1. Forgotten Empire.

2. Epigraphia Carnatica. Vol. VIII, Sh. 104.

వీరబుక్కరాయలు (క్రీ. శ. 1355—1377)

బుక్కరాయలు విజయనగరసామ్రాజ్యాధీశుఁడు కాకమున్నె ద్వారసముద్రమును, హోసపట్టణమును రాజధానులుగా హోయిసలరాజ్యమును బాలించుచుండె నని యిదివఱకే వ్రాసియున్నాఁడను. మైసూరులోని బెంగళూరుజిల్లాలో నొకశాసనమువల్ల హరిహరుఁడును, బుక్కరాయలునుగలసి రాజ్యముచేయుచుండిరని (క్రీ.శ.1346) తెలియుచున్నది.[1] అనఁగా సోదరులిరువురుఁగొంతకాలము రాజ్యభారమువహించి తరువాత నిద్దఱును వేఱ్వేఱుసీమలకు స్వతంత్రపరిపాలకులుగ నున్నట్లు తోఁచెడిని. ఏదియెట్లున్నను క్రీ.శ.1355సంవత్సరమున బుక్కరాయలు తన రాజధానిని హోస్పట్టణమునుండి విజయనగరమునకు మార్చుకొనినట్లు శాసనములు తెలియఁజేయుచున్నవి.[2] అనఁగా హరిహరుఁడు క్రీ. శ. 1354లేక 1355 ప్రాంతముల మృతినొందఁగా బుక్కరాయలు విజయనగరసింహాసనాసీనుఁడై రాజ్యమును విజయనగరమునుండియె పాలించుచుండవలెను. అదియుఁగాక హరిహరరాయలరెండవ సోదరుఁడును, ఉదయగిరి రాజ్యప్రతినిధియు నైనకంప

1. Epigraphia Carnatica, Vol. IX, BN. 59.
2. Epigraphia Carnatica, Vol. XII, PG 74.

యుండవలెను. ఏలనన
ందు కంపభూపతి కుమారుఁ
విక్రమసింహపురము(Nellore)
గిరిరాజ్యములోని ములికినాటివిష
టివిషయమునుఁ బాలించుచుండెనని
మెచ్చుతగ్గుగా నాకాలమునందే కంపభూ
వకుమారుఁడగు కుమారశావన్నయొడయరు
యగిరిపట్టణమును రాజధానిగా ఉదయగిరిప్రాంతము
లను బాలించుచున్నట్లును శాసనములు తెలియఁజేయు
చున్నందునఁ [1] గంపభూపతి క్రీ. శ.1355 ప్రాంతములందే
మృతుఁడై యుండి యుదయగిరిరాజ్యము రెండుభాగము
లుగా విభజింపఁబడి యతనికుమారులపాలనమం దుంచ
బడియుండవచ్చును. కావున హరిహరరాయలును, కంప
భూపతియు మరణించుటచే బుక్కరాయలు క్రీ. శ. 1355
సంవత్సరమున విద్యానగరసింహాసనస్థుఁ డాయెను.

బుక్కరాయనికాలమందే విద్యానగరమునకు విజయనగరమని బిరుదునామముఁగూడ వచ్చెనని విద్యానగరనిర్మాణప్రశంసయందు నాకుఁ దోఁచినయాధారములతో నిరూపించియున్నాఁడను.

---

1 (a) Epigraphia Indica, Vol. III, Page 24.
(b) Epigraphical Collections for 1906, No. 510.

కుమారకంపరాయని దక్షి

బుక్కరాయనికుమా

వచ్చెడిని. వీరలలో కుమారకంప

గన్నవాఁడు. ఇతనిశౌర్యప్రతాపమ

కాక కావ్యములందును వర్ణింపఁబడెను.

గంగాదేవి రచించిన కంపరాయచరిత్రము

రాయని యనన్యసామాన్యపరాక్రమమును, ఇత,

దిగ్విజయయాత్రయు వర్ణింపఁబడినవి. కంపరాయచరిత్ర మునందలిభాగములు[1] 'విజయనగరచరిత్రకాధారములు' అనుగ్రంథమున నీయఁబడినవి. కంపరాయచరిత్రము నుండి కుమారకంపరాయలదిగ్విజయయాత్ర సంగ్రహముగా నిట తెల్పుచున్నాఁడను. కుమారకంపరాయని గూర్చి శాసనము లేమిచెప్పుచున్నవో ప్రథమమునఁజూపి తరువాత నితనివిజయము లభివర్ణించెదము. కంపన మొట్ట మొదట ములువాయిరాజ్యమునకు రాజప్రతినిధిగానున్న ట్లును[2] తరువాత శా. శ. 1283సంవత్సరమునం దనఁగా

1. Sources of Vizianagar History, Kamparayacharitram of Gangadevi—Pages 23—28.

2. Epigraphia Car ‹ica, Vol. X, KL. 203; and Epigraphical Collections for 1906—No. 523 (Date—S. S. 1275),

క్రీ. శ. 1361సంవత్సరమునం దితఁడు దక్షిణదేశమునం దలి రాజ్యముల జయించుటకును, దక్షిణమధురాపురము నేలుచున్న తురుష్కులఁ జక్కడఁగించుటకు నియోగింపఁ బడినట్లును[1] మనకుఁ దెలియుచున్నది. దక్షిణదేశమునం దలి ద్రావిడప్రాంతముల్ గెల్చినతరువాత నితఁడు రాజగంభీరరాజ్యమును స్వతంత్రముగాఁ బరిపాలించుచుండెనని రెండుశాసనములవల్ల ప్రస్ఫుటమగుచున్నది.[2] ఇతని రాజ్యము దక్షిణసముద్రతీరము వఱకును పశ్చిమమున మైసూరులోని ప్రస్తుతపుబెంగుళూరు, కోలారుజిల్లాల ప్రాంతములవఱకును వ్యాపించియుండెను.[3] ఇతనిశాసనములు క్రీ.శ.1374వఱకుఁ గాన్పించుచున్నవి. ఇతనిశాసనములు క్రీ.శ.1353మొదలు (Kadiri Record of S. S. 1275 No. 523 of 1906.) గాన్పించుచున్నందున నితఁ ఆసంవత్సరము మొదలు క్రీ.శ.1374వఱకుఁ ద- దక్షిణాపథమునంతయు నేలుచుఁ దఁ విజయనగరసామ్రాజ్యమును

---

1. Sewell's lists
2. (a) Epigr
   (b) Ep
3. E-

page 2

రాయలు స్వర్గస్థుఁడుగాకమున్నె క్రీ.శ. 1374 లేక 1375 ప్రాంతములఁ గీర్తిశేషుఁడై యుండవచ్చును.

కంపరాయచరిత్రము

"కుమారకంపరాయలు బుక్కరాయలకు దేవాయి యనుభార్యవల్ల జన్మించిన జ్యేష్ఠకుమారుఁడు. కంప రాయలకు జవ్వనము వచ్చినతరువాత బుక్కరాయ లీతని తుండీరమండలాధిపతియైన సాంపరాయనిపై దండ యాత్ర వెడలుమని యాజ్ఞాపించెను. తుండీరమండలాధి పతియైన సాంపరాయలను జయించినపిమ్మట కాంచీనగర మును, కొందఱువన్యరాజులను జయించి, పిదప మధురా పురము నేలుచున్నతురుష్కులపై నితఁడు దండెత్తి

... సాంపరాయలకును కంపరాయనికిని విరించిపుర

యుద్ధము జరిగెను. సాంపరాయనిసైన్య

... పాగ్నికిఁ దాళఁజాలక పలాయి

... పలాయితుఁడై రాజగంభీర

కంపరాయ లాతని

...ంచి సాంపరా




౧౯. విఠ్ఠలరాయ దేవాలయములోని కళ్యాణమంటపములోని
శిలాస్తంభములపైనున్న శిల్పచిత్రములు

64A



౨౦. విఠ్ఠలరాయదేవాలయమునకు
దగ్గరనున్న రాజుగారి త్రాసు

64 B

సాళువవంశము

ఇట్లు కంపరాయచరిత్రమునందు సాంపరాయలు సంహరింపఁబడెనని వ్రాయఁబడియున్నను, ఆంధ్రకావ్యమైన జైమినీభారతమునందుఁగాని సంస్కృతకావ్యములగు సాళువాభ్యుదయము, రామాభ్యుదయమునందుఁగాని సాంపరాయలు సంహరింపఁబడెనని వ్రాయఁబడలేదు. సరికదా, మీఁదుమిక్కిలి కంపరాయనికి నీదిగ్విజయమునందు సహకారిగనున్న సైన్యనాయకులలో నొక్కఁడగు సాళువమంగు సాంపరాయస్థాపనాచార్యుఁడని బిరుదువహించి విఖ్యాతిగాంచెనని వ్రాయఁబడియున్నది.

జైమినీభారతము ప్రథమాశ్వాసము ముప్పదిరెండవపద్యమున సాళువమంగి ట్లభివర్ణింపఁబడెను.

సీ. దురములో దక్షిణసురతాను నెదిరించి
కొనివచ్చి సాంపరాయనికి నిచ్చె
సామ్రాజ్యమున నిల్పి సాంపరాయస్థాప
నాచార్యబిరుదవిఖ్యాతిఁ గాంచె
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యఱ్వదివేల
మాడ లద్దేవు నుమ్మడికి నొసఁగె
మధురాసురత్రాణు మడియించి పరపక్షి
సాళువబిరుదంబు జగతి నెఱపె

ఒప

తే. గబ్బితనమునఁ దేజి మొగంబుగట్టి
తఱుచు నగరంపుగవకుల విఱుఁగఁద్రోలి
తాను వేసినగారు నుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పొంగు సాళ్వమంగు.[1]

ఈసాళువమంగు కంపరాయనిదగ్గఱ నుద్యోగులలో నొక్కఁడని దాలవనూరుశాసనమునందు వ్రాయఁబడియున్నది. ఇతఁడు 'సాళువమంగుమహారాయ' యని వ్రాయఁబడియుండెను.[2] సంస్కృతకావ్యమైన రామాభ్యుదయమందు సాళువమంగు కంపరాయని స్నేహితకోటిలోనివాఁడని తెలుపఁబడినది.[3] ఏదియెట్లున్నను కుమారకంపరాయలకు దక్షిణ దిగ్విజయయాత్రయందు జయము కూర్చినవాఁడు సాళువమంగేయని చెప్పకతప్పదు. రామాభ్యుదయమునందు కంపరాయలకు సహాయార్థము సాళువమంగు దక్షిణదండయాత్రకు వెడలెనని స్పష్టముగాఁ దెలుపఁబడినది. సాళువమంగు, మధురాసుల్తానుని జంపి

---

1 Saluvabhyudayam, Canto I. S 46 47.
శ్లోకములు 46, 47 రెంటిలో సాళువమంగు సాంపరాయని గెల్చినట్లును మఱల నతనిరాజ్యము నతని కిచ్చివేసినట్లును స్పష్టముగా వ్రాయఁబడియున్నది.

2 No. 52 of Epigraphical Collection for 1905.

3. Ramabhyudayam, page 33; Sources of Vijaya nagar History.

నట్లును శ్రీరంగదేవుని బ్రతిష్ఠించినట్లును సాళువాభ్యుదయ రామాభ్యుదయ కావ్యములందుఁగూడ వ్రాయఁబడియున్నది.[1]

గోపనమంత్రి

కుమారకంపరాయనికి దక్షిణదిగ్విజయమునందు సాహాయ్యముఁ జేసినవారలలో నతనిబ్రాహ్మణసేనానియగు గోపనయనువాఁడొకఁడు. క్రీ. శ. 1353 సంవత్సరారంభమునందే యీవిప్రసేనాని కంపరాయలకడ సేనాధిపతిగఁ బ్రవేశించెను.[2] ఇతని రంగనాథశాసనముతప్పనితనిఁగూర్చి శాసనాధారముల్గాఁ గూడిన చరిత్రమేమియుఁ దెలియుటలేదు. కాని నంబూరికేశవాచార్యకృత 'ఆచార్యసూక్తిముక్తావళి'యను తెలుఁగు కావ్యమునందును, ప్రపన్నామృత మను సంస్కృతకావ్యమునందును గోపనమంత్రియే శ్రీరంగవిభుని బ్రతిష్ఠాపించినట్లు వర్ణింపఁబడియున్నది.[3]

1. జైమినిభారతములో 60000 మాడలు శ్రీరంగదేవుని కిచ్చియున్నట్లు వర్ణింపఁబడినను, పైనుదహరింపఁబడిన సంస్కృతకావ్యములు రెంటియందును 1000 సాలగ్రామముల నిచ్చినట్లు చెప్పఁబడినది.

2 A. S. R. 1907-1908, page 240.

3. Sources of Vizianagara History page 39. and 41; ప్రపన్నామృతము—అధ్యాయము 122; ఆచార్యసూక్తిముక్తావళి-ఉల్లాసము, 3.

ఈగోపనమంత్రి ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజ గోత్రుఁడు. ఇతఁ డొకనాఁడు యాత్రార్థము తిరుపతికిఁ బోయినపు డచ్చట తిరుపతి వెంకటేశ్వరులసన్నిధిని ఒక లోహవిగ్రహమునుజూచి యది శ్రీరంగనాథుని విగ్రహ మని తెలిసికొని యచ్చటనుండి దానిని దీసికొనిపోయి, చెంజీ పురసమీపమున నున్న సింగరాయఁపురమునందుఁ గోటల యొక్కటిగట్టించి యందా దేవుని మొదటఁ బ్రతిష్ఠించెనట. తరువాత శ్రీరంగమునకు స్వసైన్యములతోఁ బోయి అచ్చటి మహమ్మదీయనాయకుని అతని యనుచరులను సంహరించి, శ్రీరంగనాయకుని విగ్రహముఁ గొంపోయి స్వదేవాగారమునం దుంచెనట. ఈ కథ ప్రపన్నామృత మునం దొకరీతిని, ఆచార్యసూక్తి ముక్తావళియం దొక రీతిని వర్ణింపఁబడినది.

పైని వివరింపఁ బడినదానికన్న నెక్కుడు కంపరా యనిగుఱించి మన కేమియుఁ దెలియుట లేదు. ఇతఁడు సంతానములేకనే బుక్కరాయలకుఁ బూర్వమే చనిపోయి యుండునని నాయూహ.

మాధవమంత్రి

ఇతఁడు బుక్కరాయలకాలమునకుఁ బూర్వమే యితనిసోదరుఁడగు మారప్ప పశ్చిమతీరమందున్న అర

హామలెరాజ్యము పాలించుచుండగా నతనికడ మంత్రిగ నున్నట్లు ఇదవఱకె వ్రాసియున్నాను. ఈమాధవుండు క్రియాశక్తిపండితుని శిష్యుండైనట్లును, హరిహరబుక్కరాయలసోదరుండైన మారప్పకడ మంత్రిగ నున్నట్లును, ఇతనితండ్రి పేరు చౌండప్పయైనట్లును, ఇతనిగోత్ర మాంగీరసగోత్రమనియు, ఇతండు గొప్ప వేదపండితుండనియు, ఉపనిషన్మార్గ ప్రతిష్ఠాగురుండనియు, పశ్చిమతీరమందున్న దేశమును జయించెననియుం దెలియుచున్నది. అదియుంగాక నితండు పశ్చిమతీరమందున్న దేశమునకుం బరిపాలకుండుగా నియమింపంబడినట్లును, గొప్ప శైవుండనియు, త్ర్యంబకనాథపూజాపరతంత్రుం డనియుంగూడ క్రీ. శ. 1368 సంవత్సరపు శాసన[1] మొక్కదానివల్లం దెలియుచున్నది. అదేసంవత్సరము మఱియొక శాసనమునం దితండు మొదటి బుక్కరాయలకుం బ్రతినిధిగ వనవాసి నేలుచుండెనని వక్కాణింపంబడినది.[2] ఇతండు ప్రథమహరిహరరాయలకాలమునందును, బుక్కరాయలకాలమునందుం గాక రెండవహరిహరరాయల కాలమునందుంగూడ వనవాసి రాజ్యమును బాలించుచుండెను. క్రీ.శ.1384సంవత్సరము

1. Epigraphia Carnatica, Vol. VII, Shikanpur No. 281
2. Indian Antiquary, Vol. IV, page 206.

నందితఁడు వ్రాయించినదానశాసనమునం దిట్లు వ్రాయంబడినది. "రెండవహరిహరరాయల యాజ్ఞానుసారముగ మాధవమంత్రి జయంతిపురములేక వనవాసిరాజ్యపాలకుఁడుగ నియమింపఁబడెను. ఇతఁడు కొంకణదేశపురాజధానియైన గోవానగరమును స్వాధీనముఁ జేసికొని మహమ్మదీయులఁ బాఱఁదోలెను. సప్తనాథునికి మఱలఁ బూజలు జరుగునట్లు ఏర్పాటులు చేసెను." తనపేరిటఁ దానువ్రాసిన గ్రంథముల రచనాసందర్భమునఁ దనకుఁ దోడ్పడిన నిరువదినలుగురు బ్రాహ్మణులకు భూదానములఁ జేసెను. ఈ శాసనమునందే యితనికి 'ఉపనిషన్మార్గప్రవర్తకాచార్య, భువనైకవీర' అనుబిరుదులు వ్రాయఁబడినవి.[1]

ఇతఁడు పెక్కుగ్రంథములను వ్రాసియుండెను. సూతసంహితకు తాత్పర్యదీపిక యనువ్యాఖ్యానమును, శైవామ్నాయసారము, మాధవ నిదానము మొదలైన గ్రంథములను వ్రాసియుండెను.

బుక్కరాయల కేడ్గురుకుమారులు. వారలు రెండవ హరిహరరాయలు, తరువాత కంపరాయలు, చిన్నకంపరాయలు, సంగముఁడు, విరూపన్న, భాస్కరరాయలు, మల్లినాధరాయలు అనువారలు. ఇందు కంపరాయని

1. Epigraphia Carnatica, Vol. VIII, Tirthahalli, No 46.

చరిత్ర యిదివఱకే తెలిపియున్నాను. తండ్రికాలమునందు భాస్కరరాజులు ఉదయగిరిని రాజప్రతినిధిగఁ బాలించుచుండెను.[1] పెనుగొండను రాజప్రతినిధిగ విరూపన్నరాయలు పాలించుచుండెను.[2] కొంతకాల మితఁడు అరగమలె రాజ్యమునకుఁగూడఁ బ్రతినిధిగ నేర్పఱుపఁబడినట్లు తోఁచెడిని.[3] మిగిలిన సోదరుల వృత్తాంతము తెలియుటలేదు.

బుక్కరాయలు హరిహరరాయల కాలమునందువలె సామ్రాజ్యమునందలి వివిధరాష్ట్రములకు వేర్వేఱు రాజప్రతినిధుల నియమించెను. అందులోఁ గొందఱు తన కుమారులే కలరు. మిగిలినవారు సమర్థులైన మహాప్రధానులుగను, సైనికులుగను నుండిరి.[4]

బుక్కరాయని పరిపాలనమునందే విజయ
మ్రాజ్యము ఉత్తరమున కృష్ణానదివఱకును,
మధురామండలమువఱకును, పూర్వపశ్చి
ములనంటివ్యాపించియుండెనని స్పష్టము
నగరరాజ్య మిప్పుడు వీరభోజ్యమై

1 Epigraphical Collections for
2 Epigraphia Indica, Vol. VI.
3 Epigraphia Carnatica, Vol
(S. S. 1285)
4. P. A. S. R. for 1907-19

ఇతఁడు విద్వత్ప్రియుఁడు; గనుకనే మాధవమంత్రివంటి గొప్పవిద్వాంసుల నాదరించెను. వివిధ మతములవారికి మతవైషమ్యములు గలుగకుండ నివారించెను. తాను శైవమతావలంబియైనను శ్రావణబెల్గోలా యను పట్టణమున జైనులకును వైష్ణవులకును మతకలహము జనించి నపుడు వారికి రాజీ కుదిర్చెను.[1] ఇతఁడు హిందూమతో ద్ధారకుఁడై సాయణమాధవులఁ బ్రోత్సహించి వేదభాష్యములరచనకుఁ గారకుండయ్యెను. బుక్కరాయలు ఉత్తర హరివంశకావ్యమును రచించిన నాచనసోమునకుఁ బంపా తటమున భాస్కరక్షేత్రమున శ్రీవిరూపాక్షస్వామిసన్ని

శ. 1266 తారణ సంవత్సర చైత్ర శుద్ధ నవమి
ాకినీతటమునందున్న పంచాలకదిన్న యను
బుక్కరాయపురమని పేరుపెట్టి ధారపోసి
ంచెను.[2]

కడపటిదినములందు 'అనంతరసాక్'
ంత్రిగ నుండెననియు,నితని పేరటనే

---

Sravana Belgola, Translations.

భాగము, పుట 334.

అనంతసాగరమను చెరువును బుక్కరాయల కుమారుఁడగు భాస్కరరాయలు త్రవ్వించినట్లును తెలియుచున్నది.[1] ఈ మంత్రియే పెనుగొండ దుర్గమును గట్టించినట్లు పెనుగొండలోని శా. శ. 1276 లేక క్రీ.శ 1354 సంవత్సరమున లిఖింపఁబడిన యొకశాసనమువల్లఁ దెలియుచున్నది.[2]

బుక్కభూపతి పరిపాలనము

ఎవ్వరేమివ్రాసినను బుక్కరాయలుమాత్రముసామాన్యపురాజులలోఁ - జేర్పవలసినవాఁడు కాఁడు. అతఁడు సర్వస్వతంత్రుఁడు. బహుదేశములను జయించి పాలింపుచున్నవాఁడు. భూరిపరాక్రమవంతుఁడు. హరిహరరాయల కాలమునుండియు సామ్రాజ్యాభివృద్ధికై సమస్తవిధములఁ గృషిచేయుచుఁ దన ప్రభుత్వకాలములో సామ్రాజ్యమును మహోన్నతదశకుఁ గొనివచ్చెను. సంపత్తియందును, రాజ్యవిస్తారమునందును, సామర్థ్యమునందును, విజయనగర సామ్రాజ్యము బహమనీరాజ్యముకంటెను మిన్నయై శ్రేష్ఠత్వము వహించియుండెననియు, సముద్రపు రేవగు గోవా పట్టణమును, మాల్గామను దుర్గమును, తుళువరాష్ట్రములోని యనేక మండలములును విజయనగర సామ్రాజ్య

1 Epigraphical Collections for 1903, No. 91.

2. Epigraphia Indica, Vol. III, Page 238.

మునకు వశములై యుండెననియు, మలయాళము, సింహళము మొదలగు దేశముల రాజులు రాయలకడకు రాయబారులను బంపి విలువగల కానుక లర్పించుచుండిరనియు విజయనగరద్వేష్టయగు ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. బుక్కరాజు ప్రజారంజకుఁడుగ నుండెను. ప్రజలు ప్రభువు యెడ భక్తివిశ్వాసములు గల్గియుండిరి. బుక్కరాయలు తనపరిపాలనకాలములోఁ జెఱువులను, బావులను, కాలువలను త్రవ్వించి సస్యసమృద్ధి గలుగఁజేసి ప్రజలకు సౌఖ్యమును గలిగించెను. భూమిశిస్తునుగూర్చి నియమము లేర్పఱచెను. ఇతఁడు విద్యానగరమును విస్తరింపఁజేసెను. పట్టణమునందు భవ్యమందిరములును పెద్దవియైన గిడ్డంగులును వెలసినవి. దక్షిణహిందూస్థానమున వర్తకమునకుఁ బ్రధానస్థానమగుటఁజేసి ధనికులగు వణిక్శ్రేష్ఠులు అనేకులు విజయనగరమునఁ గళాకౌశల్యములుగలభవనములను నిర్మించి కాపురముండిరి. బుక్కరాయలకాలమున నీమహానగరము వీరులకును, విద్వాంసులకును రక్షకస్థానమై 'విజయనగరము,విద్యానగరము' అనురెండునామములును సార్థకపఱుచుకొని వన్నెకెక్కుచుండెను." 1

---

1. ఆంధ్రులచరిత్రము, మూఁడవభాగము, పుటలు: 369-370. బుక్కరాయనికాలమునకును, శ్రీకృష్ణరాయనికాలమునకును వ్యత్యాస

వీరబుక్కరాయలు క్రీ. శ. 1377 సంవత్సరమున స్వర్గస్థుఁడైనట్లు యేడటూరుశాసనమువల్లఁ దెలియుచున్నది.[1] వీరబుక్కరాయలమరణానంతరము పెద్దకుమారుఁడగు హరిహరరాయలు రాజ్యమునకు వచ్చెను.

## రెండవ హరిహరరాయలు క్రీ. శ. 1377-1404

రెండవహరిహరరాయలు వీరబుక్కభూపాలునికి గౌరాంబికయందు జనించినపుత్త్రుఁడు. తండ్రిమరణానంతరము విజయనగరాధీశుఁడయ్యెను. హరిహరరాయలును, బుక్కరాయలును 'మహామండలేశ్వర' బిరుదనామముతో సంతసింపవలసినవారైనను, ఇతఁడు మహారాజాధిరాజరాజపరమేశ్వరయను బిరుదులను వహించెను. ఈబిరుదులవలన ఇతనిచేతిక్రింద మాండలికరాజు లనేకు లున్నట్లును, ఇతనిచక్రవర్తిత్వము వారెల్లరు శిరసావహించినట్లును

మెఱుంగక గారి ప్రోసుఁజేసి యున్న బుక్కరాయలకును మహమ్మదుషాహకును జరిగిన యుద్ధవృత్తాంతము సత్యమునకు దూరమైనదనియు, ఫెరిస్తా వ్రాసినచరిత్ర విశ్వాసార్హమైనది కాదనియు, శ్రీవీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్రము- మూఁడవభాగము పుట 362-364లలో సకారణముగ నిరూపించియున్నారు. కావున యీసంగతియంతయు ననవసరమనియుఁ జరిత్రకు సంబంధించకుండుటచేతను, ఇచ్చట వివరింపలేదు.

1. Epigraphia Carnatica, Vol· IV, YD. 46.

దెలియఁగలదు. ఈతనికాలమందు మహమ్మదీయులకు నితనికి యుద్ధములు జరిగినట్లును ఆయుద్ధములలో నితఁడే జయముగాంచినట్లును శాసనములవల్లఁ గానవచ్చు చున్నది. 1

ఇతనికాలమందుఁ బ్రతిభావంతులగు సచివాగ్రేసరులును, వీరాగ్రగణ్యులునగు చమూపతు లుండినట్లును వారిసహాయమున విజయనగిరరాజ్యలక్ష్మి సకలవైభవశోభితయైనట్లును ఆమంత్రిపుంగవుల యుదంతమువల్లఁ దెలియుచున్నది. అట్టివారలలో ముఖ్యుఁడు విద్యారణ్యులవారిసోదరుఁడు సాయనాచార్యులవారు. రెండవవాఁడు గౌడబ్రాహ్మణుఁడైన మాధవమంత్రి. ఈమాధవమంత్రి బుక్కరాయనికిఁగూడమంత్రియనియు, నితఁడు రెండవహరిహరరాయల కాలమునఁగూడ నుండి గోవానగరమును జయించి మహమ్మదీయులఁ బాఱఁదోలెననియు వీరబుక్కరాయలచరిత్ర సందర్భమునఁ జెప్పియున్నాను. మూఁడవవాఁడు ముద్దపదండనాయకుఁడు. ఇతఁడు రెండవ హరిహరరాయలకాలములో నధికవిఖ్యాతిఁగాంచిన పురుషసింహుఁడు. ఈముద్దప్పనుగూర్చి రెండుశాసనములు

---

1. Journal Bombay Branch, Royal Asiatic Research, page 227, and Mysore Inscriptions, page 226.

గలవు. ఆశాసనములవల్ల నితనివృత్తాంతము కొంతవఱకుఁ దెలియుచున్నది.[1] అందుమొదటి శాసనమునందు హరిహరరాయలు ముద్దప్పను, పూర్వము రాముఁడు దశరథునియొద్దనుండి సుమంతుని బడసినట్లు వడసెననియు, నితఁడు తనరాజనీతిచే శత్రురాజుల బంధించెననియు, రాజైన హరిహరరాయలు రాజ్యభారమంతయు మంత్రియగు ముద్దప్పపైనుంచి విష్ణుమూర్తివలె సుఖాసీనుఁడై యుండెననియు వ్రాయఁబడియున్నది. రెండవ శాసనమువల్ల విశేషాంశములు తెలియవచ్చుచున్నవి. ఈ శాసనములోని యంశముల నిందు సంగ్రహముగా వ్రాయుచున్నాను. 'చంద్రవంశములో విఖ్యాతుఁడగు బుక్కరాయలు జన్మించెను. నలనహుషాదిరాజులు రాజ్యము చేసిరికాని బుక్కరాయలవలెఁ బేరుగాంచినవారు కారు. ఆతనికుమారుఁడు హరిహరరాయలు రాజ్యము చేయునప్పుడు రాజ్యము శత్రువుల కభేద్యమై యొప్పెను. అతఁడనేక దానధర్మములఁ జేసెను. చోళపాండ్యకేరళ దేశదిగ్విజయమువల్ల నాతఁ డందినయశము దక్షిణదిగ్భామినికి అద్దమువలె నుండెను. ఆతఁడు దిగ్విజయయాత్రకు శరదృతువులో వెళ్లినను, అతనిచేఁ జంపఁబడిన యవనులభార్యలు

1. Mysore Inscriptions, pages ,55, 267.

రాళ్ళు కన్నిటిచే దినము లెప్పుడును మేఘాచ్ఛాదితము లుగా నుండును. ఇతఁ డెప్పుడును సర్వమతములయెడల సమభావముతో నుండును. అతఁడు విశాలరాజ్యమును, ప్రఖ్యాతిఁగాంచిన ముద్దపదండనాయకుని, వడసెను. తన రాజనీతిచే ననేకరత్నావళులను సంపాదించి యుదయన రాజుమంత్రియైనయౌగంధరాయణునికిఁదలవంపులుగల్గున ట్లొనరించెను. తనబాహుబలదర్పంబున ననేకశత్రు రాజులను బందీకృతులఁ జేసెను. విప్రుల కనేకాగ్రహారముల నొసంగెను. సమస్తజాతులను దనపుత్త్రులవలెఁ బ్రోచెను. అతనిరాజ్యములోఁ దమకుఁ గల్గుచున్నసౌఖ్యమునకు సంరక్షణమునకు మాఱుగా నాతనిరాజ్యములోనిప్రజలు అతనిమంత్రివర్యునకుఁ గొన్నిపన్ను లొసంగుట కొప్పుకొనిరి. ఏయేసరకులమీఁద నెవ్వ రెవ్వ రెంతెంత పన్ను లీయవలసియున్నదియు నీ శాసనమునందు వివరముగా వ్రాయఁబడినది. రాజమార్గములందు నడచు నేనుఁగులు, గుఱ్ఱములు, బండ్లు మొదలైన వాహనములును, ఔషధద్రవ్యములు, ధాన్యములు, వస్త్రములు, పశువులు, చేతిపనులు, వర్తకద్రవ్యములు నుదహరింపఁబడుట వల్ల నీకాలమునందు విజయనగరసామ్రాజ్యమున వర్తకము విరివిగా సాగుచుండె ననుట స్పష్టము. ఇట్టి వర్తక

నియమముల నేర్పఱచుటకు వర్తకసంఘము లుండితీర వలయును. ఈశాసనములో నీక్రిందిపట్టణములు గ్రామములునువ్రాయబడియున్నందున రాజ్యవిస్తారమును వర్తకబాహుళ్యమును వెల్లడియగుచున్నది. "హస్తినావతి, విజయనగరి, ద్వారసముద్రము, పెనుగొండ, ఆదవని, ఉదయగరి, చంద్రగిరి, మాలువాయి, కాంచి, పాదవీడు, చతురంగపట్టణము, మంగలూరు, బారకూరు, హొన్నవర, చందవరు, అరగ, చంద్రగుత్తి, అన్నిగెరి, నిడుగల్లు, చిన్నతనకల్లు, తరైకల్లు, అనవిడ్డు, శరికల్లియు, తెలకలంబి, సింగపట్టణము."

ఈముద్దప దండనాథుఁడును, రెండవ హరిహరరాయలును క్రియాశక్తియొడయరుశిష్యులని శాసనములు వాకొనుచున్నవి.[1]

రెండవహరిహరరాయలకుగుండప యను దండనాథుఁడొకఁ డుండెను.[2] హరిహరరాయలకు హిందూమంత్రులు కాక జైనమంత్రులుగూడ నుండిరి. విజయనగరములోని యొకజైనదేవాలయమున కెదురుగనున్న ధ్వజస్తంభము మీఁద నున్నశాసనమునుబట్టి యితనికి బైచదండ

1 Epigraphia Carnatica, Vol·V, C.N. 256 and No.58 of Epigraphical Collections for 1892·

2. Mysore Inscriptions, P· 226·

నాయకుఁ డొకఁడు గలండని తెలియఁగలదు. ఈజైన దండనాయకుని కుమారుఁడే ఇరుగప దండనాయకుఁడు. ఇరుగపదండనాయకుఁడు హరిహరరాయలయొద్ద మంత్రిగ నుండెననియు, 'మహాప్రధాన, రాజప్రతిపాలక' యను బిరుదులు కలవనియు, నితనిశాసనమువల్లఁ దెలియు చున్నది.[1] ఇతఁడే నానార్థరత్నమాలయను నిఘంటువును రచించినవాఁడు. దానిలో హరిహరరాయలు రాజ్యభార మంతయుఁ దనపై నుంచెనని, యిరుగప్పయె చెప్పుకొని నాఁడు.[2] ఇతఁడే విజయనగరములోని గంగిత్తి దేవాలయ మును నిర్మించెను.[3] దీనినిఁబట్టి హరిహరరాయలు హిందూ మంత్రులను హిందూపండితులనేకాక మతాంతరులగు జైనులనుగూడ సన్మానించి వారలకు రాజ్యములో సత్యున్నతపదవుల నొసంగి, వారిమతమును బ్రోచి విఖ్యాతిఁ గాంచెనని తెలియుచున్నది.

హరిహరరాయలువిజయనగరమునందుఁ బాలించు చుండఁగా యువరాజైన మొదటి దేవరాయలు (Deva-

---

1. Epigraphical Report, 1923, Page 116

2. Sources of Vzianagar History; Nanartharatnamala. Page. 52.

3. South Indian Inscriptions Vol I p 156



౧౧. హేమకూటపర్వతమునుండి కనబడు
జైనదేవాలయములు, తుంగభద్రానది

80A

Raya I) యుదయగిరిరాజ్యమును పాలించుచుండెను.[1] హరిహరరాయలకాలములో హిందువులకును మహమ్మదీయులకును పోరాటము కల్గి యందు హిందువులకే జయము కల్గెను. మహమ్మదీయులు ఆదవాని (Adoni) దుర్గమును సమీపించి దానిచుట్టు ప్రక్కలనున్న భాగముల వశపఱచుకొన యత్నించినపుడు రెండవ హరిహరరాయలసోదరుఁడైన మల్లినాథయొడయరు పుత్త్రుఁడగు వీరచెన్నప్పయొడయరు వారల నెదుర్కొని, ఆదవాని దుర్గమును స్వాధీనమును జేసికొని మహమ్మదీయుల నోడించి, యాదుర్గమును హరిహరరాయల కిచ్చెను.[2] హరిహరరాయలకు మల్లాంబికవల్ల జనించిన కుమారులలో నొక్కఁడగు విరూపన్న లేక విరూపాక్షరాయలు తుండీర, చోళ, పాండ్యరాజ్యములు గెల్చి తండ్రికొసంగెననియు, నాప్రాంతములకతండె రాజప్రతినిధిగ నుండెననియు విరూపాక్షరాయల అలంపూడి శాసనములవలన విదితమగుచున్నది.[3] కనుక హరిహరరాయలకాలములో

1. Indian Antiquary, Vol. XXX VIII, page 91 and Nellore Inscriptions, Kg 23.

2. Epigraphia Carnatica, Vol. XII, Kg-43; Forgotten Empire (2nd Edition. pp. 50-51.

3. Epigraphia Indica, Vol. III page 224-230.

విజయనగరసామ్రాజ్యము నుత్తరమునఁగృష్ణానదివఱకును దక్షిణ పాండ్యదేశమువఱకును, పూర్వపశ్చిమతీరముల నంటుకొని వ్యాపించియుండెననియు విస్పష్టముకదా!

విజయనగరరాజ్యము- రెడ్డిరాజులు, రాచవారు

రెండవహరిహరరాయులు విజయనగర సామ్రాజ్యమును బరిపాలించుకాలముననే కొండవీడురాజ్యమును కుమారగిరిరెడ్డి భూపాలుఁడును [క్రీ.శ. 1383-1400], రాజమహేంద్రవరరాజ్యమును కుమారగిరిశ్యాలకుఁడైన కాటయవేమారెడ్డియుఁ [క్రీ శ.1386-1410]బరిపాలించుచుండిరి. కుమారగిరిరెడ్డి నిత్యవసంతోత్సవ ప్రియుండగుటచే నితనికి వసంతరాజని బిరుదు కలిగెను. ఇతనికి అవచితిప్పయ్యసెట్టి సుగంధభాండాగారాధ్యక్షుఁడై యుండి ప్రతివసంతోత్సవకాలమునకుఁ దగిన కస్తూరీ కుంకుమ ఘనసార సంకుమద హిమాంబుకాలాగురు గంధసార ప్రభృతి సుగంధద్రవ్యము లొడగూర్చుచుండెను. ఈయవచితిప్పయ్యశెట్టి దక్షిణమున సింహళము నుండియు, నుత్తరమున పందువా ఢిల్లీనగరములనుండియు సరకులు నావలపైఁగొని తెచ్చుచుండెనట. ఈతని ప్రభావము హరిహరరాయలు, ఫిరోజిషా, గజపతి మొదలగు రాజ

ప్రముఖులు వర్ణించుచుండిరట. ఈవిషయ మంతయు శ్రీనాథకృత హరవిలాసమున నభివర్ణింపఁ బడినది.[1]

ఓరుగల్లును బాలించుచున్న రాచసింగమనాయఁడు హరిహరరాయలకు సామంతుఁడై యుండెను. కాని రెడ్డి రాజులుమాత్రము విజయనగరాధీశులకు లోఁబడియుండ లేదు. హరిహరరాయలు తనకుమార్తె యగు హరిహరాంబను కాటయవేమారెడ్డి పుత్త్రుఁడగు కాటయ ప్రభునకిచ్చి వివాహము గావించెను.[2]

---

1. గీ. పాండువా ఢిల్లి రాడాది పట్టణముల
యధిపతులు మాళిదాల్చు రత్నాంబరంబు
లవచిత్రిపురారితకానీత యానపాత్ర
సింహళద్వీపమండల క్షేత్రజములు.

మ. తరుణాచీనిశవాయి గోవ రమణాస్థానంబులం జందనా
గరు కర్పూర హిమాంబు కుంకుమరజః కస్తూరికా ద్రవ్యముల్
శరధిం గప్పలిజోగులన్ విరివిగా సామాన్ల దెప్పించు నే
ర్పరియౌ వైశ్యకులోత్తముం డవచిత్రిప్పం డల్పుఁడే యిమ

చ. హరి హరరాయ ఫీరోజిమహా సురథాణ గజాధిపాది భ
వనలు నిజప్రభావ మభివర్ణన సేయఁ గుమారగిర్య ధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహి
తిరుమలనాథ సెట్టికిని ధీసఖభట్టికి నెవ్వ రీడనన్

2. Annual Report on Epigraphy,

## మొదటి దేవరాయలు [క్రీ.శ. 1406-1422]

హరిహరరాయలు చనిపోయినతరువాత నతని కుమారులకు రాజ్యాధిపత్యవిషయమై కలహములు సంభవించెను. ఎట్టకేలకు దేవరాయలే రాజ్యము నధిష్ఠించి క్రీ.శ.1406 సంవత్సరము నవంబరు 5 తేదీ శుక్రవారము నాఁడు పట్టాభిషిక్తుఁడయ్యెను.[1] దేవరాయలు తండ్రి బ్రతికి యుండిన కాలములలో ఉదయగిరిరాజ్య మేలుచున్నట్లు వ్రాసియున్నాఁడను. ఈతనిమంత్రిశిఖామణి లక్ష్మీధరుఁడు. ఇతఁడు మాధవవిద్యారణ్యులయొక్కయు, సాయనాచార్యులయొక్కయు మేనల్లుఁడు. రాజ్యద్రోహులు కొందఱు దేవరాయలను కోటగుమ్మముకడ సంహరించుటకుఁ ప్రయత్నింపగా వారల కుతంత్రముల నెఱింగి, పట్టుకొని హరించి రాయలను సంరక్షించెనట. ఇతఁడు పంపాతట ందలి మాల్యవంతము (పర్వతము) గుహలో గణపతి ...మును ప్రతిష్ఠాపించెను.[2] దేవరాయలరాజప్రతి ... నగ్రగణ్యుఁడని చెప్పఁదగిన విఠన్న దండ ... అరగడరాజ్యమునకు రాజప్రతినిధిగా నియ

---

...Kielhorn's Southern List No. 480.

... Researches, Vol XX—Page 31. Vide ...cal Collection for 1888-89.

మింపఁబడెను. వివిధఖండములకు రాజప్రతినిధులు నియమింపఁబడిరి. వారిలో ముఖ్యుఁడైన నాగన్నదండనాయకుఁడు ముళువాయి రాజ్యమును,[1] విరూపన్నదండకుఁడు గోవెగుత్తిరాజ్యమును,[2] శంకరదేవయొడయరు బరకూరురాజ్యమును,[3] బాచప్పదండనాయకుని సోదరుఁడగు మహాప్రధానమల్లప్పయొడయరు చంద్రగుత్తిరాజ్యమును బాలించుచుండిరి. రాజకుమారులైన హరిహరరాయయొడయరును, వీరమల్లనయొడయరును. భవానీతీర ప్రాంతమును, ప్రస్తుతము విరల్ దుర్గప్రాంతమును బాలించుచున్నట్లును[4] రామచంద్రరాయలు ఉదయగిరిరాజ్యమును బరిపాలించుచున్నట్లును నెల్లూరుశాసనములవల్లను దెలియుచున్నది.

విక్రమార్క చరిత్రమును వ్రాసిన జక్కనకవి జన్నయమంత్రి దేవరాయల మంత్రిగానుండెనని వ్రాసియున్నాఁడు. జన్నయమంత్రి దేవరాయలు ఉదయగిరి రాజప్రతినిధిగా నున్నప్పు డతనికడమంత్రిగానుండనోపు.

---

1. Epigraphia Carnatica, Vol. X, Ml. 7.
2. Do. Vol. VII, Sk. 37.
3. Do. Vol. VII, Sk. 288.
4. A.S.R. 1907-08 Page 246.
5 Indian Antiquary, Vol. XXXVIII, Page 91.

"సీ. విమలవర్తనమున వేదశాస్త్రపురాణ
వాక్యార్థసరణికి వన్నెపెట్టెఁ
బరమహృద్యంబైన పద్యశతంబున
దేవకీతనయు విధేయుఁ జేసె
రసికత్వమున దేవరాయమహారాజ
కరుణాకటాక్షవీక్షణముఁ గాంచెఁ
గర్ణాటకటకముల్ కలయంగ మెచ్చంగ
గణకవిద్యాప్రౌఢి ఘనత కెక్కె
గీ. గురులఁ బోషించె సత్కవీశ్వరులఁ బెంచెఁ
బ్రజలఁ బాలించె భాగ్యసంపద వహించె
హారితమునిముఖ్యవంశరత్నాకరేంద్ర
చంద్రుఁడై యొప్పె సిద్ధయజన్నమంత్రి."

మఱియు జక్కనకవి సిద్ధనమంత్రి నిట్లభివర్ణించుచు దేవరాయలకడఁ జామనయను మంత్రివర్యుఁ డొక్కఁ డుండెనని వ్రాయుచున్నాఁడు.

"సీ. చిత్రగుప్తునినైనఁ జింతింప నరుఁడైన
గణిత విద్యాప్రౌఢి ఘనతకెక్కె
నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చఁ గా నొనర్చె

నాణెముత్యములసోయగము మించినవ్రాలు
వరుసతో నిరుగేల వ్రాయనేర్చె
నాత్మీయలిపియట్టు లన్యదేశంబుల
రిపులను జదువంగ నిపుణుఁడయ్యె
గీ. దేవరాయ మహారాయధీవిధేయ
మంత్రివల్లభ చామనామాత్యదత్త
చామరచ్ఛత్ర శిబికాదిసకలభాగ్య
చిహ్నముల నొప్పె జన్నయసిద్ధమంత్రి."

మొదటి దేవరాయల కాలముననే నికోలోకాంటీ యను ఇటాలియా దేశస్థుఁడు విజయనగరమును దర్శించెను. అతఁడు క్రీ. శ. 1420 సంవత్సర ప్రాంతమున హిందూదేశమునకు వచ్చి ఘూర్జరదేశము మీఁదుగా విజయనగరమునకు వచ్చి చేరెను. అతఁడు విజయనగరము నిట్లు వర్ణించుచున్నాఁడు.

"విజయనగరమను మహానగరము నిమ్నోన్నతములైన పర్వతముల సమీపమునఁ గట్టఁబడినది. ఈనగరముయొక్క చుట్టుకొలత యిరువదిమైళ్లుండెను. ఈనగరమున ఆయుధములను ధరింప సమర్థులగువారు తొంబది వేల భటులున్నారు......... ఈప్రాంతములందు నివసించు

జనులు తమయిష్టము ననుసరించి బహుభార్యలను బరి గ్రహింపుదురు. వారలు జీవయాత్ర ముగించిన భర్త శవముతోఁగూడ దహింపఁబడుదురు. వారి ప్రభువు దేశములోని ప్రభువులకన్న మిక్కిలి శక్తికలవాఁడు. అతనికిఁ బండ్రెండువేలు భార్యలు గలరు. అందు నాలుగు వేలు రాజెచటికిఁ బోవునో యచ్చటికిఁ గాలినడక నడచివచ్చెదరు. మఱి నాల్గువేలస్త్రీలు సుందరాలంకార భూషితలై యశ్వారూఢలై వెంటనంటి వచ్చెదరు. రెండుమూఁడు వేలు భార్య లాతఁడు చనిపోయినపుడు శవముతోఁగూడ నగ్ని ప్రవేశము చేయ నిశ్చయించుకొనెడివారలై యున్నారు. సంవత్సరములో నొకానొక కాలమునందుఁ దమ యిలువేల్పుగాఁ బూజించెడు విగ్రహమును రెండు రథముల మధ్యనుంచి నగరవీథులం దూరేగింతురు. చిన్న పడుచులు సుందరవస్త్రాలంకారభూషిత లై దేవునిగుఱించి పాటలు పాడుచు వెంబడించివచ్చెదరు. అనేకులు భక్త్యావేశపరవశులై స్వామివారిరథచక్రములక్రిందఁ బడి మరణములొందిన భగవంతుఁడు ముక్తి నిచ్చునను నమ్మకముతో నాప్రకారము చేసి ప్రాణములను గోల్పోదురు. సంవత్సరమునకు మూఁడు గొప్ప పండువులను గావించెదరు. అందొకపండువుదినములలో

స్త్రీపురుషు లాబాలగోపాలము నదులలోను సముద్రము లోను స్నానము లాచరించి నూతనవస్త్రములు ధరియించి శుచివ్రతులై భజనలు, నృత్యములు, విందులు సలుపుచు, త్రిరాత్రములు గడుపుదురు. మఱియొకపండుగనాఁడు దేవాలయములలోపలను వెలుపలను దీపారాధనలు సల్పుదురు. మూఁడవపండుగ నవరాత్రములు జరుపఁబడును. ఆదినములలో వీథులయందు దూలములఁ బాఁతించి వానికొనలకు వివిధములగు రంగులగుడ్డలను జరీగుడ్డలను గట్టుదురు. మఱియు నొక్కొకదినమున సమస్తభూతములను సమదృష్టితోఁ జూచునొక్కొక భక్తవరుని యాదూలము చివరనుంచి నానావిధములైన పండ్లతోఁ గొట్టుచుందురు. వార లెంతయు నోపికతో నోర్చుకొనియుందురు. ఈమూఁడుపండుగలునుగాక మఱియొకపండుగ త్రిరాత్రములు జరుపఁబడును. ఆదినములలో వసంతమను పేరుతోఁ బసపునీళ్లను రాజమార్గమున నడచువారలపైఁ జల్లుచుందురు. రాజులపైనను, రాణులపైననుగూడఁ జల్లుచుందురు. ప్రజలు ఇయ్యవి చూచి కేరింతములు గొట్టుచుందురు.[1]

---

1. Forgotten Empire, P. 82-85; ఈభాగము శ్రీచిలుకూరివీరభద్రరావుగారిచే రచింపఁబడిన జీర్ణకర్ణాటరాజ్యచరిత్రమున

దేవరాయలకును మహమ్మదీయసుల్తానైన ఫిరోజిషహాతో యుద్ధములు జరిగినట్లు వ్రాయుచున్నాఁడు గాని యది సత్యమునకు దూరమై యుండునని యాంధ్రచరిత్రకారుఁడు సకారణముగా నిరూపించుచుండుటచే నావిషయముఁ బ్రశంసింప ననవసరము.[1]

దేవరాయలకు హరిహరుఁడు విజయుఁడు, మల్లన యను ముగ్గురుకుమారులు కలరు. ఈవిజయుఁడే తండ్రి కాలమున యువరాజుగ నుండెను.[2] దేవరాయలు క్రీ. శ. 1422 సంవత్సరమున మృతినొందెను.[3] తండ్రి చనిపోయినతరువాత విజయరాయలురాజ్యమునకు వచ్చెను.

## విజయబుక్కరాయలు క్రీ. శ. 1422-1423

తండ్రి మరణానంతరము విజయబుక్కరాయలు రాజ్యమునకువచ్చియొకసంవత్సరము మాత్రముపరిపాలించి

---

భాషాంతరీకరింపఁ బడియుండుటచేత నద్దానినుండియే యీవర్ణనము తయుఁ జేర్చుచుంటిని. నికోలోకోంటి వర్ణించినవి సంవత్సరాది పండుగ, దీపావళిపండుగ, మహర్నవమిపండుగలు. నాలుగవది కాముని పండుగ. ఈకామదహనమనుపండుగ మహారాష్ట్రదేశములోను, కర్ణాటదేశమునందును నేఁటికిని జరుపఁబడుచున్నది.

1. శ్రీ వీరభద్రరావుగారి ఆంధ్రులచరిత్రము. మూఁడవభాగము. పుట. 486-387.

2. Epigraphia Carnatika, Vol X Introduction, P.35.

3. Epigraphia Carnatica, Vol. IV, Gr. 24.

స్వర్గస్థుఁడయ్యెను. ఈతనిపరిపాలన కాలమునందువిశేషము లెవ్వియు లేవు కాని యొక్కవిషయముమాత్రము గమనింపఁదగియున్నది. రాజ్యములోనిమంత్రులు లంచగొండులై రైతులను బీడించుచుఁ బ్రతిభూపాలునియొక్క రాజ్యారంభమునందును బహుమతులను బడయుచుండెడివారట. అందుచే రైతులు వారివారిపొలములను విడనాడి పరదేశములకుఁ బాఱిపోయిరట. పండుగలు జరుపరైరి. దేవాలయములందుఁ బూజావిధానము లాపఁబడెనట. పంటలు లేనందునఁ బ్రజలు కాటక మనుభవించవలసెనట. అప్పుడు విజయబుక్కరాయలు వెంటనే తనమంత్రులైన అన్నప్పయొడయరు, నాగరసయొడయరు ద్వారా బలాత్కారముగా బహుమతులు వడయుపద్ధతిని నిరసించుచు నాకార్యమును రూపుమాపెను.[1] ఈతని కుమారుఁడైన ప్రౌఢదేవరాయలు క్రీ. శ. 1424 సంవత్సరమునుండి విజయనగరమును బాలించుచుండిన ట్లాధారము లున్నందున విజయబుక్కరాయలు క్రీ. శ. 1423 సంవత్సరప్రాంతమున మరణమునొందియుండును. న్యూనిజ్ విజయరాయలు కొంచెమెచ్చుతగ్గుగ నాఱేండ్లుపరిపాలించి

1. Annual Report on Epigraphy for 1904—1905, p 58, para 30.

నట్లు వ్రాయుచున్నాఁడు. కాని యీ వృత్తాంతము శాసనాధారములవల్ల నిరూపించుటకు శక్యము గాక యున్నది. స్యూయల్ పండితుఁడును న్యూనిజ్ వ్రాతలనే నమ్ముచున్నాఁడు.[1]

విజయబుక్కరాయలకు దేవరాయలు, పర్వతరాయలు, హరిహరాంబ యను కుమార్తెలు కలరు. ఈ హరిహరాంబయే సాళువ తిప్పరాజున కిచ్చి వివాహము గావింపఁబడెను. ఈవిషయము సాళువవంశ చరిత్రమునందుఁ దెలుపఁబడును. విజరాయల యనంతరము ప్రౌఢదేవరాయలు (దేవరాయలు) విజయనగర సామ్రాజ్యాధీశుఁ డయ్యెను.

## ప్రౌఢదేవరాయలు (క్రీ. 1423-1447)

విజయనగర సామ్రాజ్యము నేలిన సంగమవంశపు చక్రవర్తులలో నగ్రగణ్యుఁడైనవాఁడు ప్రౌఢదేవరాయలు. ఈప్రౌఢదేవరాయలపరిపాలనకాలమునందే యితనిచేగౌరవింపఁబడి సకలవిద్యాసనాథుఁడును, కవికులనాథుఁడునగు శ్రీనాథుఁడు కనకాభిషేకమును బొందెను. ఈభూపాలునికాలముననే పారసీక రాయబారియగు అబ్దుర్ రజాక్

1· Forgotten Empire, Page 63·

విజయనగరమును సందర్శించి యాపట్టణముయొక్కయుఁ బ్రౌఢరాయనియొక్కయు వైభవాతిశయములను వర్ణించి యుండెను. అబ్దుర్ రజాక్ విజయనగరమును వర్ణించిన భాగము ప్రత్యేకముగ నొకచోట నిచ్చియున్నాఁడను.

ప్రౌఢదేవరాయలే చరిత్రలో రెండవదేవరాయలని పిలువఁబడుచున్నాడు. ఇతఁడు క్రీ. శ. 1424 సంవత్సరమునుండి విద్యానగరము నుండి పాలించుచుండినట్లు షిమోగా (మైసూరు) జిల్లాలోని ఒక శాసనమువల్లఁ దెలియుచున్నందున దేవరాయలు క్రీ.శ. 1423 సంవత్సరాంతమునందుఁగాని, లేక క్రీ. శ. 1424 సంవత్సర ప్రాంతమునందుఁగాని రాజ్యారూఢుఁడై యుండవచ్చును.

ప్రౌఢదేవరాయనికి ఇమ్మడి దేవరాయలనియు ప్రతాపదేవరాయలనియు, గజబెంట దేవరాయలనియు, మారుపేళ్లు కలవు. ఇతనిచేఁ బ్రచురింపఁబడిన రాగినాణెములపై నొకప్రక్క నేనుఁగును రెండవప్రక్క 'రాయగజగండభేరుండ'యను చిత్రమును జెక్కఁబడి యున్నది. (Indian Antiquary, Vol. XX, Page 303) అబ్దుర్ రజాక్ హిందూరాజులు గజమృగయావిహారమునందుఁ బాల్గొనెడివారని వ్రాయుచున్నాఁడు.[2]

---

1. A.S.R. 1907-1908, Page 248

2. అబ్దుర్ రజాక్—భారతిసంపుటము 1, సంచిక 12, పు. 134-135

ఇతని కాలమందు అరగడ రాజ్యము శ్రీగిరినాథుఁడును, గోవగుత్తిరాజ్యము క్రమముగా త్ర్యంబక దేవుఁడును, హాండియరాయలును, మంగులూరురాజ్యమును నాగన్న ఒడయరును, బరకూరురాజ్యమును (బరకూరు తులురాజ్యము) చందరస, నరసింహ యొడయరులును, వీరపర్వతరాయలు (ప్రౌఢరాయల తమ్ములలో నొకఁడు) తేరకమాంచిరాజ్యమును, ప్రతాపదేవరాయలు (ప్రౌఢ రాయల సోదరుఁడు) ప్రస్తుతము ఉత్తరార్కాడుజిల్లా భాగమును, రాజప్రతినిధులే పాలించుచుండిరి.[1] రాయలకు సింగనదండనాయకుఁడు, లక్ష్మణ దండనాయకుఁడు ననెడుమంత్రులు గలరు. వీరిలో లక్ష్మణదండనాయకుడు సుప్రసిద్ధుఁడు.[2] ఇతఁడు రాజగంభ రాజ్యమునకు రాజప్రతినిధిగానుండి 'దక్షిణసముద్రాధీశ్వరుఁ'డను బిరుదుగాంచెను. ఇతఁడు సింహళద్వీపమునకుసముద్రయానముఁజేసి మఱల వచ్చెను.[3] దేవరాయని కాలమందు విజయనగరరాజ్యము సింహళము వఱకును వ్యాపించియుండును. అందులకనే కాంబోలు 'న్యూనిజ్' దేవరాయలు విశేషధనమును సమకూర్చవలెనని తలంచెను. కాని సంతత సంగ్రామ

1. A. S. R., 1907-1908. Page 249.
2. Epigraphical Collections ,1901,No 128.
3. Annual Report on Epigraphy, Page 58.

కార్య వ్యయభారముచేత 85 కోట్ల వరహాలనుమాత్రమే కూడఁబెట్టఁగలిగెను. (రత్నాలుగాక). ఈ సొమ్మొక లెక్కలోనిది కాదు. ఈతనికాలమందు 'క్విలన్', 'సిలోన్', 'పులికాటు' దేశములరాజులు ఇతనికిఁ గప్పము కట్టుచుండిరి.[1]

ప్రౌఢదేవరాయలు జైనమతమును బోషించెను.[2] పాన్సుపారిబజారుమార్గమున నొకజైనాగారమునునిర్మించి దానిపై శాసనమును జెక్కించెను. ఈశాసనమునం దితనికి 'రాజాధిరాజపరమేశ్వర' యనుబిరు దున్నట్లు వ్రాయఁబడెను.

ప్రౌఢదేవరాయలు తనబాహుపరాక్రమమువల్ల కొండవీడు వినుకొండరాజ్యములను జయించెను. ఆరెడ్డి రాజులు, పద్మనాయకవీరులు రాయలకుఁ గప్పము కట్టుచుండిరి. రాయల కాదేశములను స్వాధీనపఱచుకొనుటకుఁ దోడ్పడినవారట తెలుఁగురాయఁడును, పంట మైలారెడ్డియు ననువారలు.

---

1. Forgotten Empire, Page 302.

2. South Indian Inscriptions, Vol, page 160

తెలుఁగురాయఁడు

'ఇతఁడు శ్రీమన్మహామండలేశ్వర మేదిని మీసరగండ కఠారిసాళువరాయ విభాళమహారాజుయొక్క కుమారుఁడై శ్రీమన్మహామండలేశ్వరమేదిని మీసరగండ కఠారిసాళువశంభురాయదేవ మహారాజపుత్రుఁడైన శ్రీమన్మహామండలేశ్వరమేదినిమీసరగండకఠారిసాళువధరణీవరాహ తెలుఁగురాయఁడుగాని మఱియొక తెలుఁగురాయఁడు కాఁడు. ఇతనిరాజధాని వెలనాటిసీమలో కృష్ణానదీ ముఖద్వారమున నున్న శ్రీకాకుళమని తెలియుచున్నది. తెలుఁగురాయనితండ్రియగుశంభురాయఁడును, సాళ్వమంగు జయించిన శంభురాయఁడును వేర్వేఱు పురుషులుగాని యొక్కరు గారు. ఈతెలుఁగురాయల శాసనములు వెలనాడు, పొదిలసీమలలోను, సింహాచలములోను గన్పట్టుచున్నవి. ప్రౌఢదేవరాయలపక్షమున గజపతులతోడి యుద్ధమునందు రాజమహేంద్రవరము రెడ్లకు సహాయముచేయుసందర్భమున నితఁడు 1428వ సంవత్సరమున సింహాద్రికిఁ బోయి దానశాసనము వ్రాయించెను. రెడ్లను జయించి యాదేశ మాక్రమించుకొన్నవాఁడు కాఁడు."[1]

---

1. ఆంధ్రులచరిత్రము, మూఁడవభాగము, పుటలు 390–391.



౧౮. అచ్యుతరాయ దేవాలయమునకు ముందువైపునుండు సూలేమండపభాగము

96B

శ్రీనాథునకును దెలుఁగురాయనికిని జాలమైత్రి యున్నట్లున్నది. ఒకదినమున శ్రీనాథుఁడు తెలుఁగురాయని యాస్థానమునకుఁ బోయినప్పుడు రాయఁడు నీ వేమికోరెదవని యడిగినప్పుడు శ్రీనాథకవి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెనట:

'అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
ద్రాక్షా రామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభి కుంభములపై వాసించుఁ దద్వాసనల్.'

శ్రీనాథుఁ డవసానకాలమందుఁ గష్టముల ననుభవించుచున్న కాలమున విలపించుచుఁ జెప్పె నన్నపద్యమునం దీ తెలుఁగురాయని ప్రశంస కలదు.

"సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు
రంభఁగూడెఁ దెనుంగురాయ రాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వరిపంక్తిఁ గలదు
కైలాసగిరిఁ బండ మైలారువిభుఁ డేగె
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు

భాస్కరుఁడు మున్న దేవునిపాలి కరిగె
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి."

పంట మైలారరెడ్డి

ప్రౌఢదేవరాయలు విశ్వాసమునకుఁ బాత్రులైన సేనాధిపతులలో మైలారువిభుఁ డొక్కఁడు. ఇతఁడు బహుపరాక్రమశాలి. ఇతఁడు రాయలకుఁ దురుష్కులతోను గజపతులతోను యుద్ధముపొసఁగినపు డాయనకు మిగులఁ దోడ్పడెను. ఈతనితాత పోతరెడ్డి. తండ్రి ముమ్మడీంద్రుఁడు; తల్లి ముమ్మాంబ. ఇతనికి 'ధరణీవరాహుఁడు', 'చౌహత్త మల్లుండు', అను బిరుదనామములు గలవు. ఇట్టి మహాశూరుఁడు తన కొడఁగూర్చిన జయముల కత్యంత ముద మంది ప్రౌఢరాయ లొకదినమున నితనిఁ బిలిపించి నీకేమి కావలయునో కోరమని వేఁడెనట. అందుల కాతఁడు తన కేమియు నక్కఱలేదనియు బ్రాహ్మణోత్తముల కొక చక్కని యగ్రహారము దానముచేయుమనియు వేఁడెనట. అంత రాయ లతని కోర్కెప్రకారము శా. శ. 1351 (క్రీ.శ. 1449) కీలకనామసంవత్సర మాఘ మాసములో భాస్కరక్షేత్రమున హేమకూటమున నివసించు విహా

పాకురాయలసన్నిధిని పూరినాటిసీమలో గుండ్లకమ్మనది యొడ్డున నుండు పోలవరమను గ్రామమునకుఁ చేజెర్ల యను నామ మిడి బ్రాహ్మణుల కగ్రహారముగా ధారవోసెనట.[1] ఈమైలారురెడ్డిని గూర్చియే శ్రీనాథుఁడు "కైలాసగిరిఁ బండె మైలారువిభుఁ డేగి డనవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు?" అని విలపించినది.

## శ్రీనాథుని కనకాభిషేకము

ప్రౌఢరాయలు విద్యానగర సామ్రాజ్యము నేలు చుండఁగనే కవిలోకనాథుఁ డగు శ్రీనాథుఁడు విజయ నగరమునకువచ్చి యాతని సందర్శించెను. రాయలయాస్థా నమున అష్టభాషాకవితా సామ్రాజ్యాభిషిక్తుండును, డిండి మకవి సార్వభౌమ బిరుదాంకితుఁడును శ్రీకంఠాగమ శిఖండమండనమణియై ప్రప్రథమమున విజయ డిండిమము నార్జించిన డిండిమప్రభుని దౌహిత్రుండును, సభాపతి భట్టారకాచార్యభాగినేయుండును. సరస్వతీకవితాలబ్ధ కవితాసనాథుండును, యోగానందప్రహసనకర్తయు నగు నరుణగిరినాథుఁ డను మహావిద్వాంసుఁ డొక్కఁ డుండెను. ఈపండితసింహుఁడు ప్రతిపక్షులగు విద్వాంసుల నోడిం చుచు నెవ్వరిని సరకుగొనక దానిచ్చవచ్చినట్లు రాయల

1 Nellore Inscriptions, Copper plate No 18.

యాస్థానమున విజృంభించియున్న కాలముననే సకల విద్యాసనాథుఁడగు శ్రీనాథునకును ఇతనికిని విద్వత్కలహము సంభవించెను. ఈయుద్భట విద్యావివాదమునందు శ్రీనాథుఁడే జయమందెను. అంత రాయలు శ్రీనాథుని పాండిత్య ప్రభావమునకు మెచ్చి సకల విద్వజ్జనలోక సమ్ముఖమున నతనికిఁ గనకాభిషేకమును గావించెను. ఈ విజయసూచకముగ డిండిమకవి సార్వభౌముని కంచు ఢక్క పగులగొట్టింపఁబడెనట. శ్రీనాథునికిఁ గవి సార్వభౌమ బిరుదము లభించెను. శ్రీనాథున కీ రాయల యాస్థానమునఁ బ్రవేశమును బిరుదమును రాయల కుల గురువగు చంద్రభూషణ క్రియాశక్తియొడయరు వల్ల సంభవించెనని శ్రీనాథుని విరచితమగు చాటువును చెప్ప పద్యములవల్లఁ దెలియుచున్నది.

"సీ. దీనార టంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు
బగులఁగొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క

చంద్రభూపక్రియాశక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద
మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరస సద్గుణనికురుంబ, శారదాంబ!"

స్వర్ణాభిషేకము జరిగినపిమ్మట శ్రీనాథమహాకవి ప్రౌఢరాయని నీక్రిందివిధముగఁ బ్రశంసించెనట:

శా. జోటీ! భారతి! యూర్భటిన్ మెఱయుమీ!
చోద్యంబుగా నేను క
ర్ణాటాధీశ్వరుఁ బ్రౌఢదేవనృపతిన్
నాసీర ధాటీచమూ
కోటీఘోటకఘట్టికాఖురపుటీ
కుట్టాకసంఘట్టన
స్ఫోటీ......ధరార జస్ఫులకితాం
భోటిన్ బ్రశంసించెదన్.

(చాటుపద్యమణిమంజరి, రెండవభాగము, పుట 25)

శ్రీనాథుఁడే తన కనకాభిషేక మహోత్సవము విషయము తనచే రచింపఁబడిన కాశీకాఖండము కడపటి

యాశ్వాసాంతమునఁ గృతిపతియైన వీరభద్రారెడ్డిని సంబోధించుచు నిట్లు సగర్వముగాఁ జెప్పుకొనెను. *

శా. కర్ణాటక్షితిపాలమౌక్తికసభా
గారాంత సంకల్పిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధకవిరాట్
సంస్తుత్యచారిత్ర, దు
గ్ధార్ణోరాశిగభీర! ప్రాహ్ణముఖమ
ధ్యాహ్నపరాహ్ణార్చితా
పర్ణావల్లభ! రాజశేఖరమణీ,
పంటాన్వయ గ్రామణీ!

## వివాహములు—కన్యాశుల్కము—పన్నులు

ప్రౌఢదేవరాయనికాలమునాఁడు కూడ సంఘము నందుఁ గన్యాశుల్కదురాచారము ప్రబలియుండెను. ఈ సాంఘికదురాచారము క్రమక్రమముగా విజృంభించి సంఘమునకు ముప్పువాటిల్లుస్థితికిఁ దెచ్చెను. అంత రాజ్యములోని యొకభాగమైన పడవీడురాజ్యములోని

---

* కనకాభిషేకమునుగూర్చి విశేషముగఁ దెలిసికొనఁగోరు పాఠకులు శ్రీ వేటూరిప్రభాకరశాస్త్రులవారి 'కనకాభిషేక'మను గ్రంథమును గాని, 'శృంగారశ్రీనాథమును' గాని, శ్రీ వీరభద్రరావుగారి 'శ్రీనాథుఁడు' అను గ్రంథమునుగాని చదువవచ్చును.

ఆంధ్ర కర్ణాటలాట తమిళ బ్రాహ్మణులందఱును గలసి తమ తమకుటుంబములందు వివాహముల సందర్భమునఁ గన్యా శుల్కమును బరిగ్రహించరాదనియు, సాలంకృత కన్యా దానమే విధ్యుక్తమైనదనియు నొడంబడికఁ జేసికొనిరి. [1] ప్రౌఢరాయనికాలమున వివాహములపైఁ బన్ను విధింపఁ బడుచుండెను. బళ్లాలపురమనుగ్రామమున నన్నిజాతుల వారిపై విధింపఁబడి వసూలుచేయఁబడిన వివాహపుపన్ను తిరిగి వారలకిచ్చి వేయఁబడెనట. [2]

పారసీకదేశపు చక్రవర్తియగు షాహరుజ అను వాఁడు అబ్దుర్ రజాక్ అనునాతని రాయలకడకు రాయ బారిగఁ బంపెను. అబ్దుర్ రజాక్ క్రీ. శ. 1443 సంవత్స రములో విజయనగరమును, రాయలను సందర్శించెను. ఆరాయబారి యానగరమును జూచి వ్రాసియుంచిన యంశములు నీక్రింద నిచ్చుచున్నాను. ఆవర్ణనఁ జదివిన నప్పటి విజయనగర వైభవము వెల్లడి యగుచున్నది.

విజయనగరవర్ణనము (క్రీ. శ. 1443)

'జిహెజ్జా' (క్రీ. శ. 1443-చైత్రము) మాసాంత మున విజయనగరపట్టణమును జేరితిని. నారాక విని సార్వ

1. South Indian Inscriptions, Vol I, Page 82, and S. S. 1347.

2. Epigraphia Carnatica, Vol. X,G.D. 17.

భామండు స్వాగతమిచ్చుటకై తగినపరివారమును ఎదురుగ సన్నాహముం బంపెను. వారు నన్ను సముచితరీతిని గౌరవించి, చక్కని యొక సౌధమునకుం గొంపోయి విడియించిరి.

విజయనగరమేలు నృపాలుండు అసాధారణబలదర్పితుండు. అతనిసామ్రాజ్యము సింహళద్వీపప్రాంతముల నుండి కలబరిగెరాజ్యప్రాంతమువఱకు వ్యాపించి యెటు చూచిన వేయియామడలదూర మున్నట్లున్నది. అతని రాజ్యమునకుం బూర్వపశ్చిమదిశలందు సముద్రములే యెల్లలు. దేశమంతయుం జక్కగ సాగుచేయంబడుచున్న కనులపండువైన భూములతో నొప్పారుచున్నది. ఈభూపాలుని రాజ్యమందు దేశదేశాంతరనగరములతో సముద్రవ్యాపారముచేయు ప్రసిద్ధములైన రేవుపట్టణములు మూండువందలు గలవట. నగరమం దెచ్చటచూచినను రాక్షసులవలెను, కొండలవలెను భయంకరములైన యేనుంగులు వేలకొలంది గాన్పించుచుండును. ఈరాజు సైన్యమునందుం గాల్బలము పదునొకండులక్షలు గలవు. ఈదేశీయులు తమయేలికను 'రాయ' లని పిలుతురు. హిందూస్థానమం దెచ్చట నీరాయలంతటి బలదర్పసంపన్నుండగు భూపాలుం డింకొకండు లేండని విందుము.

ఇచ్చటి ప్రజలలో నందఱికంటె బ్రాహ్మణులు విశేషగౌర
వమును బొందుచుఁ బూజింపఁ బడుచున్నారు.

విజయనగరమును బోలిన యనుపమాన భాగ్య
వైభవసౌందర్యములుగల మహానగరమును ప్రపంచమం
దెచ్చటను ఇంకొకదానిని జూడఁబోము. మీఁదు మిక్కిలి
వినఁజాలమన్నను అతిశయోక్తి కాదు. ఎంత విస్తీర్ణము!
ఒకప్రాకారములోపల నింకొకప్రాకారముచొప్పన నేడు
ప్రాకారములనడుమ గట్టిన యీ మహానగరము మిక్కిలి
దుర్గమమైనది. ఏడవప్రాకారమునకు వెలుపల యేఁబదిగజ
ములవెడల్పుగల వాహ్యాళిప్రదేశము గలదు. అచ్చోట
నిలువెత్తున మొనలుదేఱి కఱుకుగానున్న బండరాళ్లు
దట్టముగా నిలువులోతునఁ బాతిపెట్టఁబడియున్నవి. వాని
మూలమున కాలిబంటుగాని రౌతుగాని సులభముగా
నారాళ్ల నడుమనుండి దూరిపోవఁజాలఁడు.

నగరము చుట్టునుగల సప్తప్రాకారములలో వెలు
పలిది వలయాకారముగానుండి యెత్తైన యొకశిఖరముపై
నున్నది.

అయ్యది రాతితోడను సున్నముతోడను గట్టిగాఁ
గటఁబడి బలిష్ఠమైన కవాటమును గలిగియున్నది.

ఆద్వారముచెంత చేయుంబవళ్లెల్లప్పుడును రక్షకభటులు లేమరక పడికావలి కాయుచుందురు. వారు దుర్గరక్షణమం దెంత యప్రమత్తులుగా నుందురో యాగంతుకులకడ నగరప్రదేశపుసుంకమును గైకొనుటలోఁగూడ నంతటి యప్రమత్తులు. తొలి కోటనుండి రెండవప్రాకారమును, దానిని గడచి మూఁడవదానిని, అందుండి నాల్గవ కోట వాకిలిని, అట్లు వరుసగా దాటుచుఁబోయి యేడవ ప్రాకారమును సమీపించితిమి. ఈకడపటి ప్రాకారము లోపల రాయలమందిరములు, సౌధములు, సభామంటపములు కొల్వుకూటములు, కచ్చేరీలు కలవు. నగరమునకు వెలుపలగల ఏడవప్రాకారమునకు నాలుగుగవనులు కలవు. అం దుత్తర దక్షిణముల వానికి నడుమను, పూర్వపశ్చిమముల వానికి నడుమను, రెండామడల దూరముండును. వెలుపలిప్రాకారములలో మొదటిదానికిని, రెండవదానికిని, నడుమగల ప్రదేశమున సారవంతములయి, సాగుచేయఁబడుచున్న భూములు, ఫలపుష్పవంతములయిన చక్కని తోఁటలు పెక్కులు గలవు. అచ్చటచ్చటను మంచి సౌధములును, ఇండ్లును, బావులును, ఆరామములును గలవు. వెలుపలినుంచి మూఁడవప్రాకారము మొదలుకొని లోపల ఏడవ ప్రహారీవఱకును, రాజవీథి

కిరుప్రక్కలును, దట్టముగా నిండ్లు, అంగళ్లు, నడుమ నడుమ వీథులు, తోఁటలును గలవు. ఏడవప్రాకారము లోపల రాయలనగరును, సభాగారములును, సౌధము లును, నాలుగురాజవీథులు గలసికొను మొగయును గలవు. ఆరాజవీథులు నాలుగు నొకదాని కొకటి యెదు రుగా నున్నవి. ముందుత్తరముగా రాయలు నివసించు నగరు కలదు. ఈనగరివాకిటనుండియే నాలుగువీథులును నాలుగుమొగలకును బోవును. ప్రతిరాజవీథిమొగను, నగరివాకిటికి సమీపమున ధనురాకారముగ నున్నతో రణముతోఁగూడిన యెత్తైన గోపురమును, దానిచుట్టును స్తంభములతో నలంకరింపఁబడిన వసారాయును గలవు. ఈరాజవీథుల మొగలనున్న తోరణగోపురము లన్నింటి కంటెను, నగరివాకిట నందమైన గోపురము కలదు. ఈతోరణ గోపురముల క్రిందినుండి నాలుగుముఖములఁ బోవు రాజవీథులు మిక్కిలి వెడల్పుగానుండి రమ్య ముగా నున్నవి. రాజవీథులం దిరుప్రక్కలనుఁబుష్ప లావికలు పరిమళము గ్రమ్ముకొను నానావిధపుష్ప ములను విక్రయించుచుందురు. అంగడివాండ్రు తమయం గళ్ల ముందట అందమైన మంచెలు గట్టుకొని తమసరకులు నమ్ముకొనుచుందురు. ఇట్లిరుప్రక్కలను అంగళ్లు, పుష్ప

లావికలు, స్థలమాక్రమించుకొనినను, అశ్వికులు, పథికులు, ఏనుఁగులు, బండ్లు, పల్లకీలు, మున్నగునవి గుంపులు గుంపులుగ నిసుకచల్లినరాలకుండ వచ్చుచుఁ బోవుచుం డుటకు వీలయినంత వెడల్పుగా రాజవీథు లున్నవి. ఈ వీథులు చాలపొడవై చూపుమేఱకు వ్యాపించియుండి, చూచుటకు మనోహరములై యున్నవి. ఏవంకఁజూచినను, పరిమళభరితకుసుమజాతులే కనఁబడుచుండును. ఇన్ని పుష్పములలో నీదేశీయులకు గులాబిపూవులన్న మిక్కిలి యిష్టము. అవి విశేషముగా దొరకును. ఇచ్చట ప్రజ లకుఁ బువ్వులనినఁ బ్రాణము. ఆహార మెంత యావశ్య కమో పూవు లంతయావశ్యకము. భోజనమైన లేకుండఁ బోవుదురు గాని స్త్రీపురుషులు పూవులు ముడువకుండ నెక్కడకుఁ బోలేరు. ఒక్కొక్కవిధమగు వస్తుచయమును విక్రయించు నొక్కొక్క ఓడవర్తకు లొక్కొకచోట గుమిగూడి వ్యాపారము చేసికొందురు. ఏసరకుల యోడ యాసరకుల దేకాని యింకొకసరకా యోడలో దొరకదు. ఇచ్చటి రత్నవర్తకులు నిర్భయముగా తమసరకులను ఎంత విలువగలవానినైనను వజ్ర వైడూర్యాదిరత్నములను మొదలైనవానిని విచ్చలవిడిగా రాసులక్రిందఁబోసి నడి వీథులందు విక్రయించుకొందురు.

అత్యంతరామణీయకమై మనోజ్ఞమైన యచ్చోటి నగరివాకిట కెదురుగానున్న నాలుగువీథులందును చక్కని నునుపైన ఱాతికాలువగుండ పరిశుద్ధజలము నగరులోనికి పట్టణములోనికి నెడతెఱపి లేక ప్రవహించుచుండును. ఈ ఱాతికాలువలు పట్టణమం దంతటను గాన్పించును. రాయలసౌధమునకుఁ గుడివైపున మంత్రిశేఖరుని సభామంటపముకలదు. ఆ విశాలమంటపమునకు నలువది స్తంభములు కలవు. దానికెదుర్గుగా మనిషికంటె నెత్తయిన వసారా యొకటి గలదు. ఆ వసారా యించుమించుగా నిరువది గజములపొడవును, ఆరుగజముల వెడల్పును గలదిగా నున్నది. దీనిని దస్తర్‌ఖానా లేక దస్తరుకొట్టు, అనిపిలుతురు. రాజ్యమునకుసంబంధించిన యావత్తుకాగితములు పత్రములు మొదలగు నవన్నియు దస్తరములుగా కట్టి యందుంతురు. ఇచ్చటనే కరణములు తెఱపిలేక లేఖల వ్రాయుచు కూర్చుందురు. ఇచ్చటిజనులు రెండువిధముల వ్రాతసామగ్రి నుపయోగింతురు. అందు మొదటిది: రెండుగజములపొడవును, రెండువ్రేళ్ల వెడల్పునుగల తాటాకులు. ఈజను లం తాటియాకులపై గంటములతో గీసుచు వ్రాయుదురు. ఈవ్రాత అంతశ్రేష్ఠమైనదిగా జనులు తలంపరు. తాటియాకులపై వ్రాయఁబడినయవి

రములు మసితో వ్రాయఁబడనందున రంగుతో కంటికిఁ గానరావు. అదియునుగాక తాటాకులు చిరకాల ముండ కపోవుటవల్ల వాటిపై వ్రాయబడినయక్షరములును, చిర కాల ముండవు. ఇఁక రెడవపద్ధతి; తెల్లపలకలకు నల్లనిరంగు పూసి వాటిపై రాతిబలపములను, పెట్టి తెల్లఁగా వ్రాయుట. ఈపద్ధతి చాలమంచిదట. ఇట్లు వ్రాసిన యక్షరములు చిరకాలము ముండును.

స్తంభములుగల యీసభామంటపముపైన నెత్తైన వేదికపై దండనాయకుఁడు రాజకీయోద్యోగులు తన్నుఁ బరివేష్టింప నిండుకొలువుండును. ఉభయపార్శ్వములం దును, వేత్రహస్తులు బారులుతీసి నిలువఁబడి యుందురు. మంత్రిశేఖరునితో విజ్ఞాపనమొనరించుకొనఁ దలంచిన వారు ఈవేత్రహస్తులనడుమ నడచివచ్చి ఏదైన యొకవస్తువును గానుకగా నొసంగి సాష్టాంగదండప్ర ణామ మాచరించి, నిలువఁబడి ముకుళితహస్తులై శిరము వంచి తెలిపికొందురు. ధన్నాయకుఁడును వారివిన్నప మాలించి, యుచితరీతిని, న్యాయవిమర్శనము గావించి తీర్పిచ్చి పంపివేయును. అతనితీర్పునకుఁ దిరుగు లేదు. దండనాథుఁడు కొలువునుండి వెడలిపోవునపుడు కొలువు చాలింపఁబడును. ఆయనకు ఏడు రంగురంగుల

గొడుగులు గలవు. అతడు బయలుదేరునపు డాఛత్రములఁ గైకొని పరివారములు ముందు నడతురు. వారిముంగట శంఖకాహళాది మంగళతూర్యములు పూరించఁబడును. అతని కిరుప్రక్కలను వందిమాగధులు కైవారములు చేయుచు, స్తోత్రపాఠములఁ జదువుచు, 'జయీభవ! దిగ్విజయీభవ!' యనుచు నడతురు. ముందు వేత్రహస్తులు బరాబరులు తెలుపుచుండ, ఇతర సేవకులు ఛత్రచామరములు బట్టుకొనిరా, దండనాయకుఁడు బయలువెడలి, రాజమందిరమున కరుగును. రాజనగరునకును, దండనాయకుని సభామంటపమునకునునడుమ ఏడు కక్ష్యాంతరములుగలవు. ఒక్కొకకక్ష్యాంతరము గడచినప్పు డాతనివెంటఁ బట్టుకొని రాఁబడు గొడుగులలో నొకటి తరువాత నొకటి వరుసగా మూసి వెనుక నుంచఁబడును.

అట్లా దండనాయకుఁ డేడుకక్ష్యాంతరములు గడచునప్పటికి ఏడుగొడుగులు వెనుక నుంచఁబడును. రాజసముఖమున దండనాయకుఁడు ఒంటరిగఁ బ్రవేశింపవలయును. ప్రవేశించి రాజ్యమునందలి సర్వవృత్తాంతముల నాతనికిఁ దెలిపి, యాతనియాజ్ఞలఁ గైకొని సెలవుదీసికొని పోవుచుండును. దండనాయకుని మందిరము రాయలనగరునకు వెనుకభాగమున నున్నది.

నగరున కెడమప్రైపున దండనాయకునిసౌధము కలదు. దానికి వెనుక టంకసాల కలదు. ఇచ్చట నీదేశమునందు చలామణియగుచున్న నాణెములన్నియు ముద్రింపఁబడుచున్నవి. ఈదేశమున మూఁడువిధములు బంగారు టంకములు రాగి కలిపి ముద్రింపఁబడుచున్నవి. వానిలో మొదటిది వరహా 'వరహా'లో సగమువిలువ గలనాణెమునకు 'ప్రతాప'మనిపేరు. మూఁడవనాణెముపేరు'పణము'. వరహాకు ఇరువదిపణములు, ప్రతాపమునకు పదిపణములం నిత్తురు. పణమున కారు'తరము'లను వెండినాణెములు వచ్చును. 'తరము'నకు మూఁడు'జతల'ను రాగిటంకములు వచ్చును. ఈదేశాచారమునుబట్టి రాయలకు సామంత మండలేశ్వరులు, మహామండలేశ్వరులు తామీయవలసినకప్పమును, సంవత్సరమున కొకమాఱు టంకసాలయందుఁ జెల్లించుచుండుట యలవాటు. ఎవ్వారికైన ధన మీయఁ దలంచినపుడు రాజులు టంకసాలపై వాని కివ్వవలసినదానికి రాయసమంపును. సిపాయిలకు బత్యము నాలుగునెలల కొకసారి రాయ లిచ్చుచుండును. అందరికిని టంకములనే యిత్తురుగాని సామంతరాజ్యములపై వచ్చుచున్న లాదాయమును విలియవేయు నాచారము రాయలపాలనమునందు లేదు.




౧౬. విఠ్ఠల దేవాలయములోని కళ్యాణమంటపము

12B

ఆ దేశపు సంఖ్య యింతయని యుజ్జాయింపుగానైనను చెప్పుట కలవిగాదు. ఎచ్చటఁగాంచినను దేశమంతయు జనసంకీర్ణమే. ఇసుకవైచిన రాలనియంత జనము గలదు. రాయల కోశాగారమునందు ధనము దాచుకొనుటకై పాతాళపుకొట్టు లనేకములు గలవు. అందు బంగారము, వెండి కరగించి దిమ్మలుగాఁ బోసి యుంచెదరు. ఆ దేశమునందు పేదవాని మొదలుకొని భాగ్యవంతునివఱకు స్త్రీలు, పురుషులు, బాలురు, చివఱకు వీథులలో దొమ్మరియాటలాడు దొమ్మరులు సహితము చేతులకు,దండలకు, మెడలకు, కాళ్లకు అమూల్యరత్నాభరణములో, పూతమెఱుఁగునగలో ఏవో కొన్నిటినైనను ధరింతురు.

......రాయలకు మంచిచక్కనైన ఏనుఁగుఒకటి కలదు... ప్రతియుదయము నీమదకరీంద్రమును రాయలసమ్ముఖమునకుఁ గైకొని వత్తురు. ప్రాతఃకాలమున నీయేనుఁగును దర్శించుట రాయలకు శుభదాయకమట. రాయల వారి రాచయేనుఁగులకు అన్నమువండి పెట్టుదురు. ఆవంట యాయేనుఁగుల ముందటనే వండవలయును. అన్న ముడికిన పిమ్మట ఆయన్నమునందు కొంచె ముప్పును, బెల్లమును వేసి రెండేసిమఃణుగుల బరువుగల ముద్దలుగాఁజేసి నేతిలోఁ

గాని పెరుగులోగాని ముంచి యాజంతువు। నోటిలో నుంతురు....... ఇట్లీవిధమున నా మత్తకరీంద్రములకు రెండువేళల మేతనిడెదరు.ఒక్కొక్క యేనుఁగునకొక్కొక సాలచొప్పున నన్నిఁటికిని యన్నిసాలలుకలవు. ఆసాలల గోడలు ఎత్తుగానుండి బలిష్ఠములుగా నున్నవి. ఆ గోడల పైన లావుదూలములును, వానిపైన కఱ్ఱసరంబియుఁ గలవు. పైనున్న దూలములకును, ఈ యేనుఁగు వీపుల కును, మెడలకును, ఇనుపగొలుసులు గట్టిగాఁ గట్టఁబడి యుండును.......వీటికి ముందఱ కాళ్లకు గొలుసుల సంకెలలుగూడఁ దగిలించఁబడును.

వేశ్యవాటికలు

టంకసాల కెదురుగా కటకపాలుని కచ్చేరీ కలదు. అతనిక్రింద నగరరక్షణమునకై పండ్రెండు వేలమంది కావలి వాండ్రు గలరు. వారికి జీతముక్రిందఁ బ్రతిదినమును మనిషి కొకపణము చొప్పున వేశ్యవాటికలందు పండ్రెండువేల పణముల సుంకము వసూలుచేయుచుందురు. వేశ్యవాటిక యందలి వెలయాండ్ర సౌధములు, వైభవ సంపదలు, అప్పటివిలాసినీతతుల సౌందర్యము మొల్కలేనగవుతో ముద్దులుగురియుచున్న వారి యొయ్యారపునడకలు, ఎం తటివారినైన వలపించు వారి నేర్పరితనపు మినుకులు,

మోహనాస్పదములైన వారి చూపులు, విలాసములు వర్ణింప నలవికాదు.

వేశ్యావాటికను గూర్చి యొకమాటమాత్రము చెప్పకతప్పదు. టంకసాలవెనుక నించుమించుగా నిరువది గజముల వెడల్పును మూఁడువందలగజముల పొడవును గలయొకవీథి కలదు. ఆవీథి కిరుప్రక్కలను చక్కని పూపొదరిండ్లతో నిండిన ముంగిట వాకిళ్లుగల శోభనగృహములు బారులుతీర్చియున్నవి. ఆప్రాంగణములందుఁ జంద్రకాంతశిలానిర్మితములైన వేదికలు వరుసగాఁ గలవు. ఆ వేదికలకు వెనుక మేడగోడలపై సింహములు, పులులు, చిరుతపులులు, ఏనుఁగులు మొదలగు వన్యమృగములు అనేకములు జీవములతో నున్నట్లుగా చిత్రింపఁ బడినవి. అపరాహ్ణమున ఎండవేడిమి యించుక తగ్గుచుండ నీవార విలాసినులు చక్కఁగా నలంకరింపఁబడిన తమయిండ్ల ప్రాంగణములందున్న చంద్రకాంతశిలావేదికలపై తివాసుల మీఁదను, కుర్చీలమీదను, సోఫాలమీఁదను,......చేటీజనముతో సుఖోపవిష్టులై యుందురు. ప్రతివారవిలాసినియు, నొడలంతయు, నవరత్నఖచితామూల్యాభరణములతో, మంచిముత్తెముల హారములతోఁ గన్నులకు మిఱుమిట్లుగొలుపు చక్కఁదనముతో, రంగుచీరలఁ

గట్టుకొని చూచువారల హృదయములను జూఱగొను చుందురు....ఒక్కొక్క పడపుటింటికి ఇద్దఱుముగ్గురు దాసీలు. వారు తమయజమానులకడ నిలువఁబడి మార్గమునఁ బోవు విట కాండ్రను...బ్రయత్నించుచుందురు...... వెలయాండ్ర పొత్తునుగూడి సుఖింపఁగోరువాఁడు ఈవీథిని బోయి తమయిచ్ఛవచ్చిన తరుణిని బడయవచ్చును. వేశ్యాగృహములందలి పరిచారకులు, దాసీలు మిక్కిలి జాగరూకులై యుందురు. విటులసొత్తేదైన పోయినచోఁ బరిచారికలకుఁ బ్రాణముమీఁదికి వచ్చును. వెంటనే వారుగృహములనుండి వెడలఁగొట్టఁ బడుదురు. ఈనగరపు టేడు ప్రహరీలనడుమ లెక్కకుమించిన వేశ్యాగృహము లున్నవి......కావలివాండ్రు అనుక్షణమును కోటలో నేమేమిజరుగుచున్నదో ప్రతిక్షణమును గటకపాలున కెఱింగింపవలెను. ఏవస్తు వెచట పోయినను ఎక్కడ నేదొంగతనము జరిగినను వెంటనే నేరస్థుని వెదకి పోయినసొత్తును, సొత్తుపోయినవానికిఁ దెచ్చియివ్వవలెను. ఏనేరమును జరుగనీయరాదు. అట్లు జరిగినచో, దానికి వారు కొంతజరిమానా నిచ్చుకొనవలెను.[1]"

---

1. భారతి-సంపుటము 1, సంచిక 12. ఈవిషయము శ్రీ భావరాజు కృష్ణరావుగారిచే 'Elliot' ఎల్లియట్ చరిత్రకారుని గ్రంథము నుండి వ్రాయబడినది.

ప్రౌఢదేవరాయలు క్రీ. శ. 1446 సంవత్సర ప్రాంతమునఁ జనిపోయెను.[1] దేవరాయలకుఁ బొన్నల దేవివలన మల్లికార్జునరాయలును, సింహళదేవివలన విరూపాక్షరాయలును జన్మించిరి. తండ్రిమరణానంతరము మల్లికార్జునరాయలు రాజయ్యెను.

మల్లికార్జునరాయలు. (క్రీ. శ. 144-1465.)

మల్లికార్జునరాయలశాసనములు (క్రీ. శ. 144) సంవత్సరమునుండియుఁ గనంబడుచున్నందున, నప్పటికిఁ దండ్రి చనిపోయియుండి, మల్లికార్జునరాయలు సింహాసన మాక్రమించుకొని యుండును.[2] ఇతనికి ఇమ్మడిప్రౌఢదేవ మహారాయలనియు, దేవరాయ మహారాయలనియు బిరుదునామములు గలవు. ఈతని ప్రధాని గణపన్నయొడ యరు. ఇతనికాలమందును వేర్వేఱు రాజ్యభాగములకు రాజప్రతినిధు లుండి రాజ్యపాలనము చేయుచుండిరి.

మల్లికార్జున రాయలకాలమునందు విద్యానగర రాజ్యము క్షీణదశకు రాఁజొచ్చెను. కపిలేశ్వరగజపతియు, బహమనీసుల్తానైన అహమ్మద్ షాహాయును గలసి విజయ నగరముపై దండెత్తిరాఁగా, మల్లికార్జునరాయలు విశేష

1. A S. R., Page 25
2. Epigraphia Carnatica, Vol. VII, Sk. 239.

ప్రయత్నమున వారినోడించి కర్ణాటదేశమునుండి తరిమెను.[1] ఈవిషయమె గంగాధరకృత గంగాదశప్రతాపవిలాస మునందుఁగూడఁ జేర్కొనంబడినది. ఈ గ్రంథమునందుఁ బ్రస్తుతాంశమునకుఁ గావలసినవిషయములు 'విజయనగర చరిత్రకాధారములు' అను గ్రంథమునఁ గ్రోడీకరింపఁ బడినవి.[2]

మల్లికార్జునరాయల కిద్దఱుకుమారు లున్నట్లు తెలియుచున్నది. కాని వారినిజవృత్తాంతమేమియు గ్రంథస్థము కాలేదు. మల్లికార్జునరాయలు చనిపోయిన తరువాత నీతనిసోదరుఁడగు విరూపాక్షరాయలే రాజ్యమునకు వచ్చెను.[3] విరూపాక్షరాయలు రాజ్యమునకు వచ్చినప్పటికి విజయనగర సామ్రాజ్యము క్షీణదశకు వచ్చుచుండెను. ఉత్తరమున రాజమహేంద్రవరము, కొండవీడు మొదలగు దుర్గములను స్వాధీనమును జేసుకొని గజపతులు విజృంభించసాగిరి. బహమనీసుల్తానులు విజయనగరరాజ్యము బలహీనమౌచున్నదని గ్రహించి యెట్లయినను విజయనగరరాజ్యమును గబళింపఁ బ్రయత్నించుచుండిరి. ఇట్లు

---

1 Indian Antiquary, Vol. XXXVIII, Page 93.

2. Sour ces of vizianagara History, Pages 65-66

3 A little known chapter of vizayanagara History, Pages 3-8.

యవనపతులును, గజపతులును సామ్రాజ్యమును మ్రింగి వేయుటకుఁ బ్రయత్నములు సల్పినను వారియాశలు సఫలముగాకుండెను. విజయనగర మింక నొక్క శతాబ్దము కృష్ణరాయాది మహారాజుల పరిపాలనమున మహావైభవము నందవలసి యుండ నట్టికార్య మిప్పు డెట్లు జరుగును?

విరూపాక్షరాయలు. (క్రీ. శ. 1465–1485)

విరూపాక్షరాయలు విద్యానగరమునేలిన సంగమ రాజులలోఁ గడపటివాఁడు. ఇతఁడు బలాత్కారముగా రాజ్యమును దనసోదరకుమారులగు రాజశేఖరరాయలకును, విరూపాక్షరాయలకును జెందకుండ గ్రహించి ప్రజలకును దండనాయకులకును నప్రియుఁడై పరిపాలనము చేయ నారంభించెను. విరూపాక్షరాయల సజ్జలూరు శాసనమునందుఁ దాను నిజప్రతాపముచే రాజ్యమును బడసెనని చెప్పికొనుటయేకాక, ఆతుకూరు శాసనమునందు మల్లికార్జునరాయలు నిశ్చయముగాఁ దనసోదరపుత్రులఁ ద్రోసిరాజని రాజ్య మాక్రమించెనని చెప్పక తప్పదు.[1] ఇతనిశాసనములు క్రీ. శ. 1465 సంవత్సరా

---

1 Epigraphia Indica, Vol. III, No. 121, A little known Chapter of Vizianagar History, page 12-13

రంభమునుండి కన్పట్టుచున్నందున నాసంవత్సరమునందే రాజ్యార్హుండై యుండవచ్చును.

విరూపాక్షరాయలు వారకామినీజనలోలుండై సురాపానప్రియుండై ప్రజలకుంగాని మంత్రి దండనాయకులకుంగాని దర్శనమీయక రాజ్యకార్యములందు విముఖతఁ గలిగియుండెను. రాజ్యము క్షీణదశకు రాఁజొచ్చెను. మహమ్మదీయులును, గజపతులును విజృంభింపఁజొచ్చిరి. కపిలేశ్వరగజపతి క్రమక్రముగా రాజమహేంద్రవరము, బెజవాడ, కొండవీడు, ఉదయగిరి రాజ్యములు వశముచేసుకొని ప్రతినిధుల నేర్పఱచెను. కపిలేశ్వరగజపతి ఉదయగిరిరాజ్యమును జయించుటయేకాకయితఁడు కాంచీనగరమువఱకుఁ బోయి యానగరమును ముట్టడించెను. కొంచెముచ్చు తగ్గుగ నాకాలప్రాంతముననే పాండ్యరాజులుకూడ కాంచీనగరముపై దండెత్తిరి. [1]

క్రీ. శ. 1469 సంవత్సరమున మహమ్మద్ గవాన్ అనునాతఁడు పశ్చిమతీరముననున్న గోవానగరమును స్వాధీనమును జేసికొనెను.

---

1 Annual Report on Epigraphy for 1906-1907, Paragraphs 56-57.

## సంగమవంశముయొక్క చరమావస్థ

ఏవంశమునందు బుక్క, ప్రౌఢదేవరాయలు మొదలగు మహారాజు లుద్భవమొంది సామ్రాజ్యము నత్యంతాభివృద్ధికిఁ దీసికొనివచ్చిరో, యావంశమునందే కట్టకడపటివారు సామ్రాజ్యమును దుస్థితిలోనికిఁ గొనివచ్చి, దుర్బలులై అవివేకులై యొకరినొకరు చంపికొన నారంభించిరి. ఈవిషయము న్యూనిజ్ ఇట్లు వ్రాయుచున్నాఁడు. "ఈరాజున కిద్దఱు కుమారులు కలరు. వారలు తండ్రియొక్క కృత్రిమమును రాజ్యము పరాధీన మగుచుండుటయుఁ గన్నులారఁ జూచి సహింపలేక నతనిని జంపఁదలంచిరి. అంత పెద్దకుమారుఁడు తండ్రిని స్వయముగాఁ జంపెను. ప్రజ లతనితండ్రి మరణానంతరము సింహాసనారూఢుఁడవుకమ్మని వేఁడగా నతఁడు రాజ్యముఁ బాలించుట కనర్హుఁడననియు, నంతటిమహాపాపికి (తండ్రిని జంపుటచేత) రాజ్యమేల యనియుఁ దనతమ్ముని రాజును జేయవలసినదనియుఁ జెప్పఁగా వెంటనే తమ్ముఁడు విజయనగర రాజ్యాధీశుఁ డయ్యెనట. కాని యతఁడు రాజ్యమునకు వచ్చినవెంటనే దండనాయకులును మంత్రులును తనయన్నగారు తండ్రిని జంపగా లేనిది తన్నుమాత్ర మేల చంపలేఁడనియు, నతనిని నీవు చంపుమనియుఁ జెప్పఁగా

నితఁడు సోదరుని జంపెను. ఇతనిపేరు పాడియోరావు (ప్రౌఢదేవరాయలు). అన్నగారిని జంపినవెంటనే తండ్రి వలెనేకాంతాలోలుఁడై దినములువెడలఁబుచ్చసాగెను."[1]

విరూపాక్షరాయల శాసనములు క్రీ. శ. 1485 వఱకుఁ గాన్పించుచున్నవి. క్రీ. శ. 1486 సంవత్సరము నాఁటియొకశాసనములో విరూపాక్షరాయల కుమారుఁడు 'ప్రౌఢదేవమహారాయఁ'డని వ్రాయఁబడి యున్నది. ఈ ప్రౌఢదేవరాయలే-'న్యూనిజ్' వ్రాసిన 'ప్రౌఢరావు' కావలయును. [2]

ఈప్రౌఢదేవరాయని కాలమందే విజయనగర మన్యాక్రాంతమై, మఱలఁ గొన్నిదినాలకుఁ దొంటివైభవమును బొందె, యెప్పటియట్ల సమస్తసంపదలకు నిలయమై వన్నెగాంచెను. సంగమవంశమునకుఁ బ్రౌఢరాయలే కడపటివాఁడు. ఇతని ప్రసిద్ధసేనానులలో నొకండగు సాళువ నరసింగరాజు అసమర్థుఁడగు తనప్రభునిఁ దొలఁగించి స్వయముగా రాజ్యపాలనముచేయ నారంభించెను.

---

1. Forgotten Empire, Pages 305—306.
2. Epigraphical Collections for 1902, No. 593.

# మొదటి విజయనగర రాజవంశము - సంగమవంశము






3

## సాళువవంశ చరిత్రము

రాజ్యలక్ష్మి చంచలమనస్కురాలు. రాజ్యము వీర భోజ్యము. కావుననే విజయనగర రాజ్యలక్ష్మి తొలుత సంగమవంశరాజచంద్రులైన హరిహరబుక్కరాయాదుల భుజాపీఠము నలంకరించి, బలదర్ప శౌర్య ప్రతిభావంతు లగువారిచే సకలవిధముల మన్ననలఁ బడసి కొంతకాలము అతులిత వైభవసమన్వితయై వెలసినను, దరువాత నావంశములోని దుర్బలులును, దుర్జనులును నగు నరపతుల సన్నిధానమున నుండనొల్లక తన కాశ్రయమునకు వేఱుపురుషుల వెదకుటఁ కారంభించి, తుట్టతుదకు సాళువాన్వయపార్థివేంద్రుల బాహుపీఠము నధిష్ఠించెను.

సాళువవంశచరిత్రము ఆంధ్ర కావ్యములలోను, సంస్కృత కావ్యములలోను వర్ణింపఁబడినది. [1] చంద్రవంశ

---

[1] (a) 'కృతిపతి వంశానుక్రమము' జైమినీభారతము, పినవీరన్న కవి.

(b) వరాహపురాణము, ప్రథమాశ్వాసము — నంది మల్లయ్య ఘంటసింగయకవులు.

(c) సాళువాభ్యుదయము (సంస్కృతకావ్యము), రాజనాథ

మున బుధుఁడు, వానికిఁ బురూరవుఁడు, మొదలగువారు జన్మించిరి. ఈవంశములో జన్మించినవారికిఁ జాళుక్యనారాయణ, మోహనమురారి, మేదినీమీసరగండ, యను బిరుదులుగలవు. ఈ కుటుంబమునందు గుండరాజు జనించెను. ఇతఁడు రామదుర్గమును, మహమ్మదీయ రాజులను జయించెను. వీనిరాజధాని కల్యాణనగరము. ఇతనిభార్య పేరు కమలాదేవి. ఇతని కీమెవలన గుండయ, సాళువమంగి దేవుఁడు, సావిత్రిమంగి దేవుడు, బలుఁడు, గౌతరాజు, ఆదిరాజులను నాలుగ్వురుకుమారులు కలిగిరి. వీరిలో సాళ్వమంగి దేవుఁడు రెండవకంపరాయల దక్షిణదిగ్విజయ యాత్రాసందర్భమున నతనికి మిగుల సహాయుఁడై జయము చేకూర్చెను. ఇతఁడు సుప్రసిద్ధుఁడు; మొదటి బుక్కరాయలచరిత్ర సందర్భమున, నితనిఁగూర్చి ప్రశంసించియున్నాను. ఇతనిగూర్చి జైమినీ భారతమున పిల్లలమఱ్ఱిపినవీరన్న ఇట్లు వ్రాసియున్నాఁడు.

సీ. దురములో దక్షిణసురతాను నెదిరించి
కొనివచ్చి సాంపరాయనికి నిచ్చె,

---

డిండిమకవి. (Sources of Vizayanagar History, Pages 30—32 and 9—100)

(d) రామాభ్యుదయము, సాళువ నరసింహ భూపాలుడు (Sources of Vizayanagara History, Pages 32—33 and 83—85).

సామ్రాజ్యమున నిల్పి సాంపరాయస్థాప
నాచార్యబిరుద విఖ్యాతిఁ గాంచె
శ్రీరంగవిభు ప్రతిష్ఠించి యర్వాదివేలు
మాడ లద్దేవు మమ్మడికి నొసఁగె
మధురాసురత్రాణు మడియించి పరపక్షి
సాళువ బిరుదంబు జగతి నెఱపె.
తే. గబ్బితనమునఁ దేజిమొగంబు గట్టి
తఱుమ నగరంపు గవకులు విఱుఁగఁ ద్రోలి
తాను వ్రేసిన గారు నుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పాంగు సాళ్వమంగు.

సాళువమంగునకు గౌతమరాజు, నాతనికి ధనంజయున కభిమన్యుఁడువలె గుండరాజును జన్మించిరి. ఈగుండరాజు భార్యపేరు మల్లాంబిక. ఈదంపతులకు అహోబల నృసింహస్వామి యిష్టదైవము. వీరిభక్తికి మెచ్చి నృసింహుఁడే వీరిగర్భమున నృసింహుఁడను నామముతో జన్మించెనట.[1] ఇతఁడే విజయనగర రాజ్యమును సంగమవంశ

---

1 సాళువాభ్యుదయము - ఆశ్వాసము. 3
ఉ. ఆమహితానుభావునకు నాసుచరిత్రకు నుద్భవించి రు
ద్దామయశోధనుల్ విజయధాములు విక్రమభీము లాహవ
స్థేములు సార్వభౌములు ప్రసిద్ధులు తిమ్మనరేంద్రచంద్రుఁడున్
శ్రీమదహోబలేశ్వర నృసింహుని యంశమునన్ నృసింహుఁడున్
(జైమినీభారతము, ఆ. ౧, ప. ౪౩)

చక్రవర్తులకడనుండి గైకొని స్వతంత్రుఁడై పాలించినది. సాళువ నృసింహునితండ్రికాలముననే యీవంశమువారికిని సంగమవంశమువారికిని బాంధవ్యము కలసినది. గౌతమరాజునకు గుండ్రాజుగాక మఱియిద్దఱు కుమారులుండిరి. అందులో రెండవవాఁడైన తిప్పరాజు రెండవ దేవరాయలకుమార్తె హరిహరాంబను బెండ్లియాడెను. ఈతిప్పరాజు నితనికుమారుఁడు గోపరాజు రెండవ దేవరాయలకాలమున రాజప్రతినిధులుగ తెక్కల్ రాజ్యమును బాలించుచుండిరి.[1] ఈతిప్పరాజుకాలమునుండియే సాళువ వంశము కీర్తిగాంచి వన్నెకెక్కెను. ఈతిప్పయ్య, సాళువ మంగిరాజువలెనే బహుపరాక్రమశాలి యని యీక్రింద విధమున జైమినీభారతములో వర్ణింపఁబడెను.

శా. ఆబాప్పాధిపు సోదరుండు నుతజ
నృశ్రీ సుధాసాధహే
లాబాహా పరిరక్షణాంబునిధి వే
లామేఖలాచక్రుఁడై
ప్రాబల్యంబున సాళ్వ తిప్పధరణీ
పాలుండు పాలించెఁ దా

---

1. Epigraphia Carnatica, Vol· X, No 3;
Epigraphia Carnatica, Vol· XI, Cd 29.

శాబప్రీతి వహించి నిత్యవినుత
  క్ష్మానాథ యూథంబులన్.

సీ. అమితవైభవముచే నసమానవైభవ
  కులిశాయుధుల నద్రిగుహల కనిచె
దోఃప్రతాపంబుచేఁ దులితప్రతాపదా
  వానిలాప్తుల నరణ్యములఁ ద్రోచె
వినుతధైర్యంబుచే విఖ్యాతధైర్యమం
  థానాద్రులను సముద్రమున ముంచె
ఘనకీర్తిచే సముత్కటకీర్తిచంద్రులఁ
  గడకొండ యవలిచీఁకట్లఁ గలిపె
గీ. నౌర! మీసరగండ కటారిసాళ్వ
పంచఘంటా నినాది భయదబిరుద(?)
కాహళారావ సంపాత కంపితారి
దీప్తిబలసిరి సాళువతిప్పశౌరి
  —జైమినీ భారతము. ఆ. ౧ ప. 39_40

సాళువ నృసింహరాయల యుదంతము క్రీ. శ.
[1486_1493]

సాళువ నరసింహరాయలు మల్లికార్జున రాయల కాలమునుండియు విజయనగరభూపాలుర సామంతుఁడుగ




౧౨. విఠ్ఠలరాయ దేవాలయములోని
ముఖమంటపముయొక్క లోవైపు



౧౮. విఠ్ఠలరాయ దేవాలయములోని
ముఖమంటపముయొక్క దక్షిణభాగము

128B

మునకుఁ బోయి, కాశీకావిశ్వేశ్వరు సందర్శించి యచట పట్టాభిషిక్తుఁడయ్యెను."

సాళువాభ్యుదయము మూఁడవయాశ్వాసమున నితఁడు చంద్రగిరిని బాలించుచున్నట్లు కవి వర్ణించియున్నాఁడు.

"తదిహ స కులరక్షసావధానో
విహరతి సాంగ్రధరోపి వేంకటాద్రిః,
సవిధ భువి తదా హితాపనాయాం
నృపవరచంద్రగిరౌని......" ఆశ్వా. 3.

ఈవీరసింహుఁడు, విజయనగరసామ్రాజ్యము దుర్బలమై యొకవంక మహమ్మదీయ విజృంభణమునకును, వేఱొకవంక గజపతులవిజృంభణమునకును, దాళఁజాలక నన్యహస్తగతమౌనని భయపడి, సామ్రాజ్యక్షేమమును గోరి, స్వతంత్రుఁడై క్రీ. శ. 1485-1486 సంవత్సరప్రాంతముల విద్యానగరమునుండి 'రాజపరమేశ' 'రాజాధిరాజ' బిరుదావళులతో సామ్రాజ్యమును బరిపాలింపఁ దొడంగెను.*

* The last record of Virupaksha available to us is one dated Friday, July 29, 1485 A. D. The first in which Saluva Narasimha appears with the Imperial titles,

సాళువనరసింగరాయలకు సామ్రాజ్య మభివృద్ధి లోనికిఁ దెచ్చి దానిని వృద్ధిపఱచుటకు విశేషమాధార మైనవాఁ డాతని దండనాయకుఁ డగు ఈశ్వరనరసింహ రాయలు. ఇతఁడు తుళువాన్వయుఁడు. శ్రీ కృష్ణదేవ రాయలతాత. ఇతఁడు వరాహ పురాణమునందు ఇట్లభి వర్ణింపఁబడెను :

"సీ. ఉదయాద్రి భేదించె హుత్తరి నిర్జించె
గండికోట పురంబుఁ గదలఁ ద్రవ్వె
పెనుగొండ సాధించె బెంగళూరు హరించెఁ
గోవెల నెల్లూరు గుంటుపఱచె
కుందాణి విదళించె గొడుగుఁ జింత జయించె
బాగూరు పంచము పాడుచేసె
నరుకొండ వెకలించె నామూరు మర్దించె
సీరంగపట్టణముఁ బాఱిసమరె

---

Rajahdhiraja, Rajaparameswara, etc. is dated November 1, 1846 A. D. Between these dates the actual usurpation must have taken place, there having been the two sons of Mallikharjuna alive at the time not counting the prince that was set aside—a son of Virupaksha—Mallikharjuna's Brother—A Little known chapter of Vizayanagar History, Page 47.

గీ. రాయచౌహత్తమల్లధరావరాహ
మోహనమురారిబర్బర బాహుసాళ్వ
నారసింహప్రతాపసన్నహనుఁ డగుచు
విశ్వహితకారి తిమ్మయయీశ్వరుండు.

మ. నరసింహక్షితిపాలపంపనుఁడు గా
నాఁజేసి దండెత్తి యీ
శ్వరభూభర్త బెడందకోటయవనా
శ్వవ్రాతముర్ భీమసం
గరరంగంబునఁ గొల్లవట్టుకొని వీఁ
కం గందుకూరీపురాం
తరసీమంబునఁ జక్కఁగా నఱికె దు
ర్దాంతారి సంతానముర్"

నరాహపురాణము, ఆ. ౧, ప. ౩౦,౩౧.

పైపద్యములలో వర్ణింపఁబడిన స్థలములు సాళువ నరసింహరాయలచే స్వాధీనము చేసికొనఁబడినవని తెలియుచుండుటచేత నీయుద్ధములందు ఈశ్వరనాయకుఁడు తనప్రభువున కత్యంతసహాయకారియై యుండును.

ఈశ్వరనాయకుని తరువాత నీతనికుమారుఁడు నరసింగనాయకుఁడు సాళువనరసింహరాయలకు ముఖ్య

సేనానాయకుఁడుగ నుండెను. ఈవిషయము శాసనము లందేకాక వరాహపురాణమునందును జెప్పఁబడినది.

"వ. అట్టి నరసింగరాజరత్నంబుచేత మన్నన వడసి సైన్యనాయకపట్టభద్రత్వంబున నిర్నిద్రవిజయ లక్ష్మీమహత్త్వంబున మదవదభియాతి భయదసత్త్వంబున దీర్ఘాయురైశ్వర్య ధుర్యుండైన యీశ్వరనాయకునకుం బ్రియతనూభవుండు నరసవసుధాధ్యక్షుండు ........"

సాళువనరసింహరాయలకే పిల్లలమఱ్ఱిపినవీరభద్ర కవి జైమినీభారతము రచించి కృతి నిచ్చెను. జైమినీభార తము రచించి నరసింహరాయ లద్దానినిఁ దనకుఁ గృతి యిమ్మని వేఁడగా పినవీరన్న యట్లేయని మూఁడు నెలలలో నక్కావ్యమును రచించి తెచ్చియిచ్చెదనని రాజసమ్ముఖమున వాగ్దత్త మొనర్చెనట. పిన వీరన్న సోమరియై గ్రంథరచనకుఁ గడంగక నూరకుండ నింతలో గడువుకాలము సమీపించెనట. అంతఁ దన కేమియుఁ దోఁపక నొకనాఁటిరాత్రి యొక్కఁడును గదిలో లోపల గడియబిగించుకొని నిద్రించుచుండెనట. అంత సరస్వతీ దేవియే వచ్చి రాత్రియంతయును దనగదిలోఁ గూర్చుండి భారతమును రచించి పీరన్న కొసంగెనట. మఱునాఁడు

వీరన్న యాత్ర
బోయి యద్దానిని జదివి స...
యిచ్చెనట. ఇతఁడు 'వాణీ నాథా...
చుండెడివాఁడట. జైమినీభారతములోఁ...
తిపతిని మనోహరముగా నిట్లభివర్ణించెను:

"సీ. హతరిపుక్షత్త్రియుండయ్యు సామ్రాజ్యంబు
గరిమఁ జేయనినాఁటి కడమ యొకటి
యోగీంద్రవంద్యుఁడయ్యును నుగ్రసేనుని
నోలగించిననాఁటి యొచ్చ మొకటి
భువనైకవీరుఁడయ్యు విభాకరతనూజు
తాపుఁ గోరిననాఁటి తక్కువొకటి
యాదిలక్ష్మీనాథుఁ డయ్యును బలిదైత్యు
నడుగఁబోయిననాఁటి హైన్య మొకటి

గీ. తలచి మూర్ధాభిషిక్తుఁడై ధరణిపతులు
గొలువ నసహాయశూరత మెలఁగి దాన
శక్తి నవతారమెత్తిన శౌరిగాక
క్షితిపమాత్రుండె సాళ్వనృసింహవిభుఁడు.

జైమినీభారతము. ఆశ్వా.౧, ప. ౪౪.

౧౩౫

ాభ్యుదయమును

ాయున్నాను. ఈ రాజమాడా

93 సంవత్సరప్రాంతమునఁ జనిపోయి

.ంహ రాయలు. (క్రీ. శ. 1493-1505.)

సాళువనరసింహరాయలతరువాత నతనికుమారులలో నొక్కఁడగు ఇమ్మడినరసింహరాయలు రాజ్యమునకువచ్చెను. కడపజిల్లాలోని ముత్తుకూరుశాసనము ననుసరించి యితఁడు క్రీ. శ. 1493 సంవత్సరమున విజయనగరము నేలుచుండెనని తెలియుచున్నది.[1] ఇతనికాలమందు జరిగినవిశేషాంశము లేవియును లేవు. ఇమ్మడినరసింహరాయలు పేరునకుమాత్రమె చక్రవర్తిగానుండెను కాని ప్రభుత్వమంతయుఁ దుళువనరసింహరాయల హస్తమునందే యుండెను. ఇమ్మడినరసింహరాయలు క్రీ. శ. 1505 సంవత్సరముప్రాంతమునఁ జనిపోయెను. ఇతని తరువాత తుళువనరసింహరాయల కుమారుఁడైన వీరనరసింహరాయలురాజయ్యెను. విజయనగరరాజ్యము తుళువాన్వయులహస్తగత మయ్యెను.[2]

---

1 No. 516 of 1906, Epigraphical Collections.

2 A Little known chapter on Vizayanagar History, Pages. 69. 70.

# సాళువవంశము

- చంద్రుడు
  - బుధుడు
    - ప్రరూవుడు
      - వంకిదేవుడు
        - గుండ్రాజు = కమలాదేవి
          - గుండ్రాజు
          - మాదిరాజు
          - గౌతరాజు
          - వీరహోబలుడు
          - సాళువమంగిరాజు
            - గౌడరాజు (ఆర్గురుసోదరులు)
              - గుండ్రాజు = మల్లాంబ
                - నరసింహరాజు = శ్రీరంగాంబ
                  - (తెలియదు)
                  - ఇమ్మడి నరసింహరాయలు
                - తిమ్మరాజు
              - సాళువరాజు
                - ప్రతాపరాజు
              - తిప్పరాజు = హరిహరాంబ (రెండవ దేవరాయల చెల్లెలు)
                - గోపరాజు
                  - తిప్పరాజు
                  - తిమ్మరాజు
          - సావిత్రిమంగిరాజు

## ౪

### తుళువవంశ చరిత్రము

తుళువవంశము సాళువవంశాంతర్గతమని కొ ప్రాయము పడియున్నారు. ఈ రెండువంశములకును బంధ మేమియును లేదు. తుళువనరసింహారాయల కృ తమిచ్చిన వరాహపురాణమునందు సాళువవంశము నభి వర్ణించి సాళువనరసింహరాయని ప్రతాపవైభవ విశేష ములు చెప్పి, తరువాత యానరసింహరాయని సైన్య నాయకుఁడును, కృతిపతియునైన తుళువ నరసింహరా యల వంశావతారంబు వర్ణించుచుఁ గవులు ఇట్లు వ్రాసి యున్నారు:

"ఉ. మిన్నులమోచి భాగ్యముల
మీఱినకోటల రమ్యహర్మ్యసం
పన్నత సస్యవాటిగరి
మంబులఁ దోఁటల వాహవారణా
భ్యున్నతిఁ గేలిదీర్ఘికల
నుగ్రభటావళి వన్నెకెక్క వా
రాన్నిధి కాంచిపైఁ దుళువ
రాజ్యము సంతత వీరభోజ్యమై.

క. ఆ తుళువరాజ్యమున వి
  ఖ్యాతి వహించిరి దిగంతకరికటతటసం
  భూతమదక్షాళనవి
  ద్యోతత్సరకీర్తిఁ బెండ్లియాడిన రాజుల్."

అదియుఁగాక కవులు వ్రాయుచున్న వరాహ పురాణమును దనకుఁ గృతి యిమ్మని కృతిపతి చెప్పినసంద ర్భమున "ఈకృతి ప్రారంభంబు కర్ణాకర్ణికగా వినినంత తసత్యభాషా హరిశ్చంద్రుఁడును, తుళువకుల దుగ్ధాబ్ధి చంద్రుఁడును......"అనియుఁ జెప్పఁబడుటచేతను రెండుకుల ములకును సంబంధము లేదని చెప్పవచ్చును.

శాసనములం దెచ్చటను తుళువవంశము సాళువ వంశాంతర్గత మని చెప్పఁబడలేదు. తుళువవంశములో విద్యానగర సామ్రాజ్య మేలినవారిలో మొదటివాఁడగు వీరనరసింహదేవరాయల శాసనములలో నొకదాని యందుఁ దుళువవంశావతార మిట్లీయఁబడినది: చంద్రునికి బుధుఁడు, వానికిఁ బురూరవాదులు జన్మించినతరువాత తిమ్మరాయలు జన్మించెననియు, నాయనకు దేవకీదేవి వలన ఈశ్వరరాజు జన్మించెననియు, నతనికి బుక్కాంబ వలన నరసరాజు కల్గెననియు, నాయనకు తిప్పాంబవల్ల వీరనరసింహరాయలును, నాగలదేవివలన శ్రీకృష్ణరాయ

లును జన్మించిరనియు వక్కాణింపఁబడినది.*వీరిలో నీశ్వర రాజును నరసరాజును సాళ్వ నరసింహరాయలకడ సేనానాయకులుగ నుండినట్లు సాళ్వనరసింహరాయని చరిత్రమున వ్రాసియున్నాఁడను. సాళ్వ నరసింహరాయని తదనంతరము తుళువ నరసింహరాయలే రాజ్య చక్రము త్రిప్పుచుండెను. ఇమ్మడి నరసింహరాయలు పేరునకుమాత్రము రాజుగానుండెను.

ఈతుళువ నరసింహరాయని పరాక్రమములు శాసనములందుఁగూడ నభివర్ణింపఁబడినవి.

పైన పేర్కొనఁబడిన శాసనములో నితఁడు కావేరికి సేతువును గట్టి, నదిని దాటి శ్రీరంగపట్టణమును ముట్టడించెననియు, చేర చోళ మధురా పాండ్య మండలముల గెల్చెననియు, యవనులను దురుష్కులను బరాజితుల నొనర్చెననియుఁ బ్రశంసింపఁబడెను. ఈవిషయములే కన్నడశాసనసంపుటములలోను, మఱికొన్ని శాసనములలోనుగూడఁ బేర్కొనంబడినవి.[1] కావున నితఁడు

* Copper plate Inscriptions of Sri Sankaracharya by T. A. Gopinatha Rao, Pages. 16-30.

1. (a) Epigraphia Carnatica, Vol. IV, Part II. Gudlupet, No. 30.
(b) No. 152 of 1901.

దుర్మదారాతిహరణ చాతుర్య ధైర్య వీర్య గాంభీర్య గుణ సంపన్నుఁడనియు, దాను చక్రవర్తి కాకపోయినను సామ్రాజ్యోద్ధరణమునకుఁ గడంగి దాని నత్యున్నతస్థితికిఁ దెచ్చినవాఁడనియుఁ జెప్పవచ్చును. ఇంతటి సర్వజ్ఞుఁ డెచ్చటను విజయనగర సామ్రాజ్యమును బాలించినట్లు వ్రాయఁబడలేదు. కొందఱు చరిత్రకారులు ఇమ్మడి నరసింహరాయలు సింహాసనమునుండి యితఁడు తొలఁగించి రాజ్యము పాలించినట్లు వ్రాసినది పొరపాటు. పైనుదహరించిన శాసనములం దావిషయము వాకొనఁబడలేదు. తెలుఁగు కావ్యములైన పారిజాతాపహరణమునందును, మనుచరిత్రయందును, వీరనరసింహరాయలే విజయనగర సామ్రాజ్యము నేలెనని వ్రాయఁబడినది:

" కం. వారలలోఁ దిప్పాంబ కు
మారుఁడు పరిపంథికంధి మంథాచలమై
వీరనరసింహరాయఁడు
వారాశిపరీతభూమివలయం బేలెన్."

పారిజాతాపహరణము

"క. వీరనృసింహుఁడు నిజభుజ
దారుణకరవాలపరుష ధారాహతవీ
రారి యగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణమహిమన్."

మనుచరిత్రము

ఈతుళువనరసరాయలే వరాహపురాణకృతిపతి. వరాహపురాణము నందిమల్లయ్య ఘంటసింగయ్యలను కవులచే వ్రాయఁబడినది. ఇమ్మడినరసింహరాయలును, తుళువనరసింహరాయలును క్రీ. శ. 1505 సంవత్సరప్రాంతములందుఁ జనిపోయినపిమ్మట వీరనరసింహరాయలే రాజ్యారూఢుఁ డయ్యెను. [1]

వీరనరసింహరాయలకు సాళువతిమ్మరసు మంత్రిగా నుండెను. ఈమహాప్రధాని కృష్ణరాయలకాలమందుఁ గూడ నుండెను. కాన నాసచివసింహునిచరిత్రము సంగ్రహముఁ గృష్ణరాయలచరిత్రము వ్రాయునపుడే తెల్పెదను. శాసనములు వీరనరసింహరాయలు దానధర్మపరాయణుఁడనియు, మిగులఁ బుణ్యవంతుఁడనియు, శ్రీశైలము కాంచి శ్రీకాళహస్తి, తిరుపతి, అహోబిలము, మహానంది చిదంబరము, మొదలగుపుణ్యస్థలములందు మహాదానములొనర్చెననియు వాకొనుచున్నవి.[2] వీరనరసింహరాయలు

1. A little known chapter of Vizianagar History, Page 50.

2 (a) Copper plates 1 and 2 of Viranarasimha Raja in Sankaracharya Matha Inscriptions of Gopinatha Rao.

(b) Epigraphia Indica, Vol. I, Page, 368, Verses 16-17.

క్రీ. శ. 1509 వఱకు రాజ్యము చేసెను. తరువాత సితని తమ్ముఁడగు శ్రీకృష్ణరాయలు సింహాసనస్థుఁ డయ్యెను.

ఆకాలపు పరిస్థితులు

వీరనరసింహరాయలు ఇమ్మడి నరసింహరాయలను గాదనిచెప్పి సింహాసననారూఢుఁడగుటచేతనో యితఁడు దుర్బలుఁడగుటచేతనో విజయనగరసామ్రాజ్యము గొంచెము హీనస్థితికి వచ్చుచుండెను. గోవానగరము నేలు మహమ్మదీయ పరిపాలకుఁడు వీరనరసింహరాయలపై యుద్ధమునకు వచ్చెను. కొండవీడు, ఉదయగిరిదుర్గములు గజపతుల వశమయ్యెను. దక్షిణమున ఉమ్మత్తూరునాయకులు సార్వభౌముని ధిక్కరించి తాము స్థిరరాజ్యమును సంపాదించుకొనిరి.ఉత్తరమున బీజపూరునవాబులు విజయనగరమును స్వాధీనమును జేసికొనుటకుఁ దలపెట్టుచుండిరి. ఇట్టి పరిస్థితులయందుఁ గృష్ణరాయలు రాజ్యమునకు వచ్చెను.

శ్రీకృష్ణదేవరాయలు (క్రీ. శ. 1500 - 1530)

ఆంధ్రభోజుఁడని ప్రఖ్యాతి గన్న శ్రీ కృష్ణరాయని చరిత్రము సమగ్రముగా నాంధ్రమహాజనులకు సమర్పించుస్థల మిది కాకపోవుటచేత నీవీరసింహునియొక్క

చరిత్రము సంగ్రహముగా మాత్రము వ్రాయుచున్నాఁడను. విజయనగరసామ్రాజ్యచరిత్రమునుగాని, రాయల చరిత్రమునుగాని వ్రాయునెడల నెంతసాధనసామగ్రి ను గలదు.

సోదరుని మరణానంతరము శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1510 సంవత్సరము జనవరి 24 వ తేదీని పట్టాభిషిక్తుఁడై విజయనగరసామ్రాజ్యము పాలింపదొడంగెను.[1]

దక్షిణ దిగ్విజయ యాత్ర

రాజ్యమునకువచ్చిన యంతటనే రాయలు రాజ్యమును గట్టుదిట్టముగనొనర్చుటకుఁ బూనుకొని, రెండేండ్లకాలము రాజ్యములోని పరిస్థితులం గనుఁగొని సైన్యమును బలపఱచి దిగ్విజయయాత్రకు వెడలెను. దక్షిణమున ఉమ్మత్తూరునాయకులు సార్వభౌముని ధిక్కరించి స్వతంత్రులగుటఁజేసి ప్రథమమున వారిని దండింప నరిగెను. ఈయుద్ధమునందు ఉమ్మత్తూరు శివసముద్రములను వశపఱచుకొనెను.[2] తరువాత శ్రీరంగపట్టణము మొదలగు ప్రదేశములఁ గైకొని దక్షిణదేశము నంతయు జయించి తగిన రాజప్రతినిధుల నేర్పఱిచి మఱల తనరాజధానికి విచ్చేసెను.

1. Journal of Royal Asiatic Society, 394-395
2. 180 of 1913, Epigraphips collections



౯. పంపాపతి (విరూపాక్ష) దేవాలయము



౧౦. తుంగభద్రానదీతీరము (పంపాపతి దేవాలయముచేరువను)

144B

## పూర్వ దిగ్విజయ యాత్ర

నెల్లూరి మండలములోని ఉదయగిరి, కొండవీడు, మొదలగు దుర్గములు గజపతుల స్వాధీనమం దుండుట చేతను, పూర్వము విజయనగర సామ్రాజ్యము లోనివే కావునను వెంటనే గజపతులఁ జక్కడఁగించి ఆయా దుర్గముల వశపఱచుకొనుటకు దండయాత్ర వెడలెను. ఉదయగిరిదుర్గమును ముట్టడించి గజపతులఁ బరాజితులం జేసెను. తరువాత అద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జున కొండ, తంగేడు, కేతవరము మొదలైన గిరిదుర్గముల వశపఱుచుకొనెను. తరువాత కొండవీడు ముట్టడించెను. కొండవీడు క్రీ. శ. 1515 సంవత్సరము జూన్ 23వ తేదీ నాడు రాయల వశమయ్యెను. ఈయుద్ధములందు ప్రతాపరుద్ర గజపతికుమారుఁడు వీరభద్రరాయనితోఁ గుమారహంవీరమహాపాత్రుని కుమారుఁడు వీరమహాపాత్రుడు, తిరుమల ప్రేయత రాయమహాపాత్రుఁడు మొదలగువారిని బట్టుకొని వారికి మఱల అభయహస్త మిచ్చెను. ప్రతాపరుద్ర గజపతికుమారుఁ డగు వీరభద్రరాయని మఱల మైసూరుజిల్లాలోని చిట్టలదుర్గప్రాంతములకుఁ బరిపాలకునిగా శ్రీకృష్ణరాయలు నిర్మించెను. పైవిషయములన్నియు రాయలు ఉదయగిరి, కొండవీడు, తిరుపతి, కాళ

౧౮౫

హస్తిధరణికోటశాసనములవల్లఁ దెలియవచ్చుచున్నవి.[1] తరువాత శ్రీకృష్ణదేవరాయలు కొండపల్లి రాజమహేంద్రవరదుర్గములను సాధించి ఉత్తరమున సింహాద్రివఱకుఁ బోయి యచ్చట సింహాచలనృసింహ స్వామివారి సన్నిధిని మహాదానధర్మము లాచరించి యొకధర్మశాసనము వ్రాయించెను. ఈశాసనము క్రీ. శ. 1516 సంవత్సరమున వ్రాయఁబడినది. అనఁగా కొండవీడు స్వాధీనమైన మఱుసటివత్సరముననే రాయలు కొండపల్లి రాజమహేంద్రవరదుర్గముల వశపఱచుకొని గజపతిని సాధించుటకై సింహాద్రివఱకు దండయాత్ర వెడలెనని స్పష్టపడుచున్నది.

కృష్ణరాయని రెండవ సింహాచలశాసనమువల్ల క్రీ. శ. 1519లో రాయలు గజపతిని జయించి, గజపతి

---

1. (a) Epigraphia Indica, Vol. VI, Pages 117-233.

(b) Nos: 53 and 55 of 1889, Epigraphical collections.

(c) No. 272 of 1897, Epigraphical collectioons.

(d) Epigraphia Carnatica, Vol. IX, Dg. 107.

2. Epigraphical Reports, Southern Circle, No. 329 of 1892.

రాజ్యములోని కొన్నిగ్రామములు శ్రీసింహాచలస్వామి వారికి భూదానము చేసెను.[1] ఇట్లు రాయలు తూరు తీరమునంతయు జయించి, విజయఘోషములతో స్వరా జధానికి క్రీ.శ. 1520 సంవత్సరప్రాంతముల విచ్చేసెను.

**రాయచూరిముట్టడి**

రాయచూరిముట్టడి క్రీ. శ. 1520 సంవత్సరము మే నెల 19 తేదీనాడు జరిగెనని యొకశాసనమువలనఁ దెలియుచున్నది.[2] ఈరాయచూరిదుర్గము బీజపురసుల్తా నగు అదిల్‌షాహ స్వాధీనమం దుండెను. బీజపుర సుల్తా నైన అదిల్‌షాహయును, శ్రీకృష్ణరాయలును స్నేహితు లయ్యును వారిద్దఱకు వైర మీక్రిందివిధముగ సంభవిం చెనట. సయ్యద్‌మర్కారు అనుతురుష్కుఁడు రాయల యొద్దనుండి గుఱ్ఱములఁ గొనితెచ్చుటకై కొంతధనమును గైకొని మఱలఁ గనుపడకుండఁ బాఱిపోయి అదిల్‌షా హా రాజ్యములో దాగియుండెనట.

ఆదుర్మార్గుని స్వాధీన పరుపవలసినదిగా రాయలు అదిల్‌షాహకు వ్రాయఁగా వాఁడు సజాతీయుఁడగుటచే నదిల్‌షాహ వాని నెక్కడకో పంపి వాఁడు తనరాజ్య

1. Epigraphical Report of 1899, Nos: 244 and 255.

2 No 47 of Epigraphical collections, 1906

ములో లేడని ప్రత్యుత్తర మిచ్చెనట. అంత రాయలు కోపోద్దీపితుండై అదిల్ షాహపై దండువెడలి రాయచూరు దుర్గమును ముట్టడించెనట. ఈయుద్ధములో అదిల్ షాహ యోడిపోయి రాయలతో సంధిని జేసికొనెనట. ఈ యుద్ధమును గుఱించి 'న్యూనిజ్ చరిత్రకారుఁడు' బహు వింతగావ్రాసియున్నాఁడు.[1] ఈసమయమునందే రాయలు కల్బరిగిని జయించెను.

రాయల కవితాగోష్ఠి.

రాయలు ఆముక్తమాల్యదాకృతికర్త. పారిజాతాప హరణ మను చరిత్రాదికృతులకు భర్త. పారిజాతాప హరణము ముక్కుతిమ్మనార్యకృతము. అల్లసాని పెద్దనచే మనుచరిత్రము విరచింపఁబడినది. ఈ రెండుకావ్యము లందును రాయల దిగ్విజయప్రతాపములు మనోహర ముగా వర్ణింపఁబడినవి. రాయల యాస్థానమున రాజశే ఖరచరిత్రమువ్రాసిన మాదయగారిమల్లన, అష్టమహిషీ కళ్యాణమువ్రాసిన తాళ్లపాకచిన్నన్న మొదలగువారు కూడ నున్నట్లు కవిజీవితకారుఁడును, కవిచరిత్రకారుఁడును వ్రాయుచున్నారు. తిమ్మణ్ణయను కర్ణాటకకవి యొకఁడు

---

1. Forgotten Empire, Pages 335-361. Chapters IX to XIX

కర్ణాటభాషలో శాంతిపర్వమునుండి యంత్యమువఱకును భారతమువ్రాసి రాయలకు కృతియిచ్చినట్లు కర్ణాట వాఙ్మయచరిత్రవల్లఁ దెలియుచున్నది. "కృష్ణరాయలు సాహిత్యమునందే కాక సంగీతమందును మిక్కిలి యభిరుచి గలవాఁడు. ఈయన యాస్థానమున బండారు లక్ష్మీనారాయణుఁడని యొకసంగీత విద్వాంసుఁ డుండెను. రాయల యంతఃపురస్థానమున నాయన నాట్యరసాధిపత్యము వహించియుండెడివాఁడు. అతఁడు రచించినది 'సంగీత సూర్యోదయ'మని యొకసంస్కృతగ్రంథ మిప్పుడు దొరకినది. దానిపీఠికలో విద్యానగరము, కృష్ణరాయని దిగ్విజయములు వర్ణితములైనవి" * అని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులవారు 'కృష్ణదేవరాయల విద్యాగోష్ఠులు' అనెడి వ్యాసమున వ్రాసియున్నారు.

పైనివ్రాయఁబడిన యందఱు కవులలోను అల్లసాని పెద్దనకుఁ గృష్ణదేవరాయల కన్యోన్యమైత్రి గలదనియు, రాయలయాస్థానమునందుఁ బెద్దనార్యునకే యధిక గౌరవము కలిగియుండెననియుఁ గృష్ణరాయని మరణానంతరము పెద్దనచేఁ జెప్పఁబడెనను ఈ క్రిందిచాటువువల్ల స్పష్టము కాఁగలదు.

---

* భారతి, సంపుటము ౨, సంచిక ౪.

సీ. "ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి
కే లూఁత యొసఁగి యెక్కించుకొనియె,
మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేఁగఁ
బల్లకిఁ దన కేలఁ బట్టి యెత్తె
గోకట గ్రామాద్యనేకాగ్రహారముల్
అడిగినసీమలయందు నిచ్చె
బిరుదైన కవిగండపెండేరమున కీవ
తగుదని తానె పాదములఁ దొడిగె
గీ. 'నాంధ్రకవితాపితామహ, యల్లసాని
పెద్దనకవీంద్ర'యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక
బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు".

రాయలశిల్పకళాభివృద్ధి

కృష్ణదేవరాయలు కవితాపోషణమునేకాక శిల్పకళాపోషణమునుగూడఁ గావించెను. ఇతఁడు నూతన మందిరములను, దేవాలయములను నిర్మించెను. విద్యానగరములోని శ్రీవిరూపాక్షదేవాలయమునకు గోపురమును గట్టించెను. ఇతఁడే లోన రంగమంటపమునుగూడ కట్టించెను. పూర్వ దిగ్విజయయాత్రకు వెడలి ఉదయగిరిని

...యమును ...

దేవాలయమునకుఁ బ్ర...

మొక బ్రాహ్మణునిచేఁ జెక్కఁబ...

కర మైనది. పైని వివరింపఁబడిన ...

నేఁటికిని నిల్చియున్నవి. వానివర్ణన ముందు మీరు చదువఁ

గలరు. సస్యసమృద్ధికొఱకుఁ గృష్ణరాయలు క్రీ.శ. 1521

సంవత్సరములో నోరగల్లునొద్ద తుంగభద్రానదికి ఆన

కట్ట యొక్కటి కట్టించి యందుండి రెండుకాల్వలు

త్రవ్వించెను. నాగలాపురమును దానిసమీపమున నొక్క

గొప్పతటాకమునుగూడ నితఁడే నిర్మించినట్లు న్యూనిజ్

వ్రాయుచున్నాఁడు. కటకాధిపతిని జయించిన పిదపఁ గృష్ణ

రాయలు విజయసౌధము నొక్క దానిని నిర్మించె నని

'పేయస్' వ్రాయుచున్నాఁడు.[1] తన ప్రియురాలి

పేరిట నాగలాపురమును నిర్మించెను. ఈనాగలాపురమే

---

1. Forgotten Empire, Pages 161-164 and 263, 264.

...లకొ
...జపతితో ...
...ధ...
...డలో ముఖ్య సైనికశిబిర
...నుండియే, యుద్ధానంతరము దక్షిణ
దిశ... బోయి ముఖ్యదేవళముల కిక్రిందిగోపుర
ములు, గర్భాలయములు మొదలగునవి గట్టించెను.
క్రీ. శ. 1516 సంవత్సరమున కాళహస్తిలోఁ గాళహస్తీ
శ్వరుని సన్నిధానమున కేగి యాలయములో శతస్తంభమం
టపమును, గొప్పగోపురమును నిర్మించెను. చిదంబరము
లోని దేవాలయమున కుత్తరగోపురమును నిర్మించెను.[2]
తిరుపతిదేవాలయమునకు సహస్రస్తంభ మంటపమును,
దానికెదురుగ నున్న తటాకమును, గర్భాలయమును,
వినాయకునిరథమును, పదునొకండంతస్తుల గోపురమును
నిర్మించెను.[3]

---

1. No. 74 of Epigraphical collections, 1903.
2. Nos. 174, 175 of Epigraphical collections of 1892
3. A. S. R. 1908-1909.

సాళువతిమ్మరు

సీ. ఏమంత్రిమ
తతె
యేమంత్రిః
ప్రక
యేమంత్రిమణి వచో
శీతలతాధూతశీతరోచి
యేమంత్రిమణి సుధాధామశాంభవధామ
ధాళధళ్యసుతుల్య ధవళకీర్తి
గీ. యట్టి మంత్రికులోత్తంస మహితనృపతి
పటలమకుటాగ్ర ఘట్టితపాదయుగళి
సకలకర్ణాటరక్షావిచక్షణుండు
దీనసురశాఖి సాళువతిమ్మమంత్రి.

—రాజశేఖరచరిత్రము.

ఈమంత్రిశిఖామణి నియోగిబ్రాహ్మణుడు; వేమయ్యగారిమనుమడు; రాచయ్యగారికుమారుఁడు. భార్య లక్ష్మమాంబ. కృష్ణరాయలయన్నగారయిన వీరనరసింహరాయలకాలములోనుండియు విజయనగర సామ్రాజ్యరక్షకుఁడై, కృష్ణరాయలకాలములో నతనికి సర్వవిషయ

1. Epigraphia Indica, Vol. VI, Page 234.

...న్నె కెక్కెను.
...ండెడివాఁడట.
...గ్రణికిని శరీర
...న్నది. బాపట్ల
తిమ్మయ్యంగారి
...శరీరము లొక్కటియై
...న్నది. [1]

...మ్మరుసు కొండవీఁడు, రాచూరు మొదలగు
...లం బట్టుకొనుటలో రాయల కత్యంతసహాయకారి
యయ్యెను. తిమ్మరుసు రాజ్యచక్రము త్రిప్పుచుండుటచేఁ
గాఁబోలు నతని బంధువులు కూడ విజయనగర సామ్రా
జ్యమునందు మంచిపదవుల నలంకరించియుండిరి. ఈతని
తమ్ముఁడు సాళువ గోవిందరాజు గుత్తిదుర్గమున కధికారి.
తిమ్మరుసునకుఁ గూఁతురు తిరుమలాంబ; చెల్లెలు కృష్ణాం
బిక. ఈపె భర్తపేరు నాదిండ్ల గోనమంత్రి. తిరుమలాం
బను తిమ్మరుసు కృష్ణాంబికకుఁ గోనమంత్రియందు జనిం
చిన జ్యేష్ఠపుత్త్రుఁడగు అప్పామాత్యున కిచ్చి పెండ్లిచే
సెను. ఈఅప్పామాత్యుఁడే మాదయగారిమల్లన కృత
రాజశేఖరవిలాస కృతిపతి. ఈతనితమ్ముఁడు గోపమంత్రి.

1. No. 186 of 1897, Epigraphical collections

జీర్ణవిజయనగ

ఈయప్పా
డవీడును
నియమించి
చంద్రోద
మను ద్విపద కా
యందును దాను తిమ్మరుసు
దుర్గాధ్యక్షుడుగ నియమింపఁ
న్నాడు. రాజశేఖర చరిత్రమునందు నీవిషయవి
షఁబడినది.[2]

సాళువతిమ్మరుసు వీరసింహుఁడును అమాత్య శేఖరుఁడును నౌటయేకాక పండితశ్రేష్ఠుఁడుగాఁగూడఁ గన్పట్టుచున్నాఁడు. ఇతను అగస్త్యకృత చంపూభారతమునకు వ్యాఖ్య రచించెను. ఆచంపూభారతమునకు గద్య యిట్లున్నది:

'ఇతి శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర కర్ణాటేశ్వర శ్రీ కృష్ణరాయశిరఃప్రధాన సకలాగమ పారావారపరీత సాళ్వతిమ్మయ దండనాథ విరచితాయాం

1. Epigraphia Indica, Vol. VI, Page. III F
2. Sources of Vizayanagara History; Pages 144, 148, 150.

...చిమ

రాయలు

తెలియు

...సకండ్లు తీయించె

...దుంచెననియు, నితఁడు రాజ

...యొనర్చుటచేతఁ గృష్ణరాయ లితని

రశిక్ష విధించెననియుఁ దెల్పెదరు. కాని యాపు

...పురాణము నమ్మఁ దగినది కాదు.

శ్రీకృష్ణదేవరాయల కాలమున 'పేయస్' అను పోర్చుగీసు దేశజుఁడు విజయనగరమునకు వచ్చి యానగర వైభవమును వ్రాసియున్నాఁడు. ఆతఁడు వర్ణించినభాగమును శ్రీవీరభద్రరావుగారి జీర్ణ కర్ణాట రాజ్యచరిత్రమునుండి యీదిగువ పేర్కొనుచున్నాను.

కృష్ణరాయలకాలమునాఁటి విజయనగరవైభవము

క్రీ. శ. 1520 సంవత్సరమున ఫెగరీడోయను పోర్చుగీసు రాయబారి విజయనగరమునకు వచ్చెను. అతనితో పేయస్ అనువాఁడుకూడ వచ్చియుండెను. ఇతఁడు తానువిజయనగరమును జూచి చాలయంశముల వ్రాసియుండెను.

---

1. Sources Vizayanagara History, Page 143.

౧౫౬

అండు

మెళ్లకీవ లె

లోనుండి మార్గ

నగరములోనికి

వేఱుమార్గములు

పాడవుగలిగి యీమహానగరం

పర్వతపంక్తికి లోపలనంటిచుట్టుకొనియు

లనేకములు కలవు. ఈపంక్తులలో నెచ్చట

భూమి యున్నయెడల నచ్చట బలాఢ్యమ

బడియున్నది. ఈరీతిగాఁ గొండలన్నియు

బడియున్నవి. జనులు నడచుటకు బాట

యున్నవి. ఆ బాట లీద్వారములగుఁ

ఈ ద్వారములకడఁ జిన్నగుహలు

అందుఁ గూర్చుండి రక్షకభటులు ద్వారముల

రక్షించుచుందురు. ఈయావరణలోపల వరిమొదలగు

ధాన్యములు పండునట్టిబయళ్లును, నిమ్మలు, నారింజలు,

పనసలు, మామిళ్లు మొదలగుఫలవృక్షములతో నున్న

తోఁటలును గలసారవంతములైన భూములును గల

ఈకొండలవరుసకు మధ్య జలాశయములు పెక్కు

...వా
...ుదటికొండ
...రముగుండ నగర
...టి ప్రక్క నిదియే
...ల చేతను, బురుజుల
...ప్పడుపట్టణ మొకటి (నాగలా
... మొదటిపంక్తిలోపలఁ గట్టఁబడినది. ఈ
కుండుతలుపులును, బురుజులును మిక్కిలి
లైనవి. ఇతరనగరములలోని గోడలవంటివి
డలు పాలగచ్చు చేయఁబడి వే ఔచ్చటను
గా నున్నవి. లోపల మిద్దెటిండ్లవలె బల్ల
న్నకప్పులుగల సొగసైన కట్టడములచే నిరు
యం దలంకరింపఁబడిన వీథులపంక్తులు రమ్య
ముగా నున్నవి.

నాగలాపురమునుండి విజయనగరమున కొకవీథి
పోవుచున్నది. ఆవీథికి నిరుప్రక్కలను ఇండ్లవరుసలు
చక్కఁగా దీర్చియున్నవి. బాటసారులకు నీడనిచ్చుటకై
వృక్షములు రెండుప్రక్కలను నాటింపఁబడియున్నవి.
ఈవీథిలో సమస్తవస్తువులును విక్రయించునంగడులు
...ు



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 109 B 1,34 0 |
| పుస్తకం పేరు | [illegible] 0 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 199 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | A |
| లేని పేజీలు | 129,130 |
| తయారు చేసినది | Soumya |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |